# రుద్రమదేవి

## (బుర్రకథ)




రచన:

సుంకర సత్యనారాయణ



విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

7||

# మనవి

ఆంధ్రదేశ చరిత్రలో కాకతీయ యుగం ఉజ్వలమైనది. దాదాపు ఆంధ్రావని అంతటినీ పరిపాలించిన వీరవనిత రుద్రమదేవి. ఆమె జీవితగాథను బుర్రకథగా వ్రాయాలనే తలంపు నాకు చాలాకాలంనుంచీ వుండేది. అది ఇప్పుడు ఫలోన్ముఖమయింది.

ఈ బుర్రకథ రచనలో కీర్తిశేషులు ప్రసిద్ధ నవలాకారులు అడివి బాపిరాజుగారి "గోన గన్నారెడ్డి" అనే నవల నాకెంతో ఉపకరించింది. నేను వ్రాసిన యీ కథను చదివి సలహాల నిచ్చిన మిత్రులకూ, దీనిని పుస్తకరూపాన ప్రచురించి నాకు ప్రోత్సాహ మిచ్చిన విశాలాంధ్ర ప్రచురణాలయంవారికీ నా అభివందనాలు.

ఇదివరకు నేను రచించిన 'సీతారామరాజు', 'కష్టజీవి', 'వీరేశలింగం' మొదలైన బుర్రకథలను ఆంధ్ర ప్రజలు ఆదరించి నన్నెంతో ప్రోత్సహించారు. ఆంధ్ర ప్రజల ప్రోత్సాహబలమే నా యీ రచనకు కారణం. ఈ బుర్రకథనుకూడా తెలుగు సోదరులు ఆదరించి నన్ను ప్రోత్సహించగలరని ఆశిస్తున్నాను.

— సుంకర సత్యనారాయణ.

# వంత పాటలు

వినరా ఆంధ్రకుమారా ధీరా - విజయము నీదేర ! -
ఖనిజసంపదకు పాడిపంటలకు - కరవులేదు మనకు ! -
విశదముగా వీరాంగన రుద్రమ - వీరగాథ వినర ! -
విశాలాంధ్ర రాజ్యస్థాపనకై - వేగమె లేలేర ! -



# కథా ప్రారంభం



శ్రీరంజిల్లెడు ఆంధ్రదేశమున – ఓరుగల్లు నగరు
ఆరువందలేండ్లకుపూర్వం బిది – ఆంధ్రరాజధాని
కాకతీయ గణపతిదేవుడు తన – కాలములో నిచట
ప్రాకటముగ కట్టించె నొకమహా – బలిష్ఠమగు కోట

వ. శ్రీ గణపతిదేవ చక్రవర్తి తెనుగుదేశాన్నంతా ఒక జండాక్రిందకు తెచ్చిన మహాయోధుడు. ఈయనకు పురుష సంతానం లేదు. కనుక తన పెద్దకుమార్తెయైన రుద్రమదేవిని కుమార్తెవలెకాక కుమారునివలె పెంచాడు. ఆర్థిక రాజకీయ శాస్త్రాలూ, సైనికవిద్యలూ నేర్పించి, ఆమెను ఓరుగల్లు సింహాసన మెక్కించాడు.

ఆ పట్టణము మహారాణి రు – ద్రమ్మ కాలమందు
కాపురమైనది వీరయోధులకు – కళలకు సిరులకును

వ. అప్పటికి కాకతీయ సామ్రాజ్యం ఎంతవరకు వ్యాపించిందంటే —

ప్రాగ్దిశ బంగాళాఖాతముర తందానా-తందాని-తందన
పడమర గోదావరీ మహానది ,,
ఉత్తరదిక్కున సింహాచలము ,,
దక్షిణమున కాంచీపురంబుర ,,
ఆంధ్రమహాసామ్రాజ్యమునకు సరి-హద్దులుగానుండె ॥తందాన॥

వ. ఇంత విశాలమైన తెలుగుదేశానికి ముఖ్యపట్టణమైన ఓరుగల్లు ఎలా ఉంటుంది —

కీర్తన

ప॥ పట్టణ సోయగము – ఆ
పట్టణ సోయగము

అ॥ వర్ణింప నెవరితరము ॥ పట్టణ ॥

చ॥ ఎంతనేర్పు కలవారో
ఎంత బాహుబలశాలురో
పగులగొట్టి నల్లరాల
పలకలెత్తినారు లీల

మి॥ అందమైన రాచనగరు లాకసమంటిన కోటలు
మందిర ప్రాకారంబులు మదికెంతో ముదముగొలుపు
॥ పట్టణ ॥

శిల్పకళా నైపుణ్యము
జీవకళా శోభితము
తెల్పును మనప్రాభవము
తెనుగుశిల్పి పనితనము

కోటలు పేటలు వాడలు నీటగు విద్యాలయములు
మేటివి గుడిగోపురములు మేలగు నాట్యస్థలములు ॥ పట్టణ ॥

గోశాల లశ్వశాలలు
గొప్పగొప్ప గజశాలలు
సైనికశిబిరాల చాలు
సత్రాలు మఠాలు వేలు

వాపీకూప తటాకము లాపూదోటలు వనములు
ఆపురి నలకాపురిగా రూపొందించినవరెరె ॥ పట్టణ ॥

వ. అంతేకాదు అక్కడ విద్యాసంస్థలలోని విద్యార్థులకు ఉచిత భోజనవసతులుకూడ వుండేవి. హనుమకొండ విద్యాలయంలో సామంతరాజుల పుత్రులనేకులు చదువుకొంటూ ఉండేవారు.

ఒకనాడు మహారాణి రుద్రమదేవి ఆ విద్యార్థులను పరీక్షించదలచింది. తగిన ఏర్పాట్లు జరిగినై. ఆమె పురుషవేషం ధరించి విద్యాలయానికి వెళ్ళి వారిని పరీక్షించింది. తరువాత తన అశ్వశాలనుండి తెప్పించిన గుర్రాన్ని విద్యార్థులకు చూపి—

రాజపుత్రులారా వినుడో రణ – రంగ ధీరులార
రాజసమొప్పగ ఎవ్వరైనను ఈ–తేజి నధిష్ఠించి
స్వారిచేయగలరాయని అడిగెను – వారిని రుద్రమ్మ
పారశీకగుఱ్ఱంబది ఎంతో – బలిష్ఠముగనుండె
చాల హుసారుగనున్నది మిక్కిలి – చక్కని దశ్వంబు
నీలిమబ్బులను, దాని శరీరము – గేలిచేయుచుండె
నలుగురి మనుషులు కళ్ళెముపట్టిన – నిలువదొక్కచోట
నలుగురుమధ్యను సకిలించుచు అది – నాట్యమాడుచుండె
తురంగమునుగని యువకులెక్కుటకు – వెరచి నిలచి అటులె
పురపుర పొక్కుచు నొకరిముఖంబొక – రరయసాగినారు

వ. ఇది ఎవరు-చూశారూ —.

ఇనతేజుడు వీరాగ్రేసరు డిం – తింతకనులవాడు
అనుపమాన గుణరూప విలసితుం – డమితధైర్యధనుడు
వినయమూ విధేయతగల యువకుడు – విశాల హృదయుండు
తనతో జదివెడి యువకులందరికి – తలమానికమైన

గన్నారెడ్డి బిరానముందునకు - కదలి వెనుకనుండి
తిన్నగ రుద్రమ యెదుటకేగి ఆ - దేవికి ప్రణమిల్లి
తప్పక నే నీగుఱ్ఱము నెక్కెద - తల్లీయని పలికె
అప్పుడు రుద్రమ యువకునిగని ఇ - ట్లనె గంభీరముగ
అసాధ్యమగు హయమిది ఒకతీరున - అంకెకు రాదుసుమ!
విసరివైచు పైనున్న మనుష్యుని - పసనారయుటకిది

వ. అప్పుడు గన్నారెడ్డి అంటాడు —

అమ్మా! నన్నాశీర్వదించి నీ - వాజ్ఞలీయవమ్మ
సమ్ముదమున నే నీగుఱ్ఱముపై - స్వారిజేతునమ్మ

వ. అనిన యువకుని పలుకాలకించి మహారాణి గన్నారెడ్డి —

పేరుగడించుము జగతిలోన ఈ - వారువంబునెక్కి
వీరయువకుడా విజయము నీకగు - వెళ్లిరమ్ము వేగ

వ. అని మహారాణి దీవించి ఆజ్ఞయిచ్చిందోలేదో!

అప్పుడు గన్నారెడ్డి సాహిణి
ఆజ్ఞలందుకొని అంబకుమ్రొక్కి
బిరాన దట్టీ బిగించికట్టి
జరీఅంచు తలపాగాజుట్టి ॥ భళిభళీ ॥
కుప్పించి పైకే లేచాడు
గుఱ్ఱంమీదే వాలాడు ॥ భళా ॥
కాళ్ళంకెములో పెట్టనెలేదు
గన్నయ కళ్ళెంపట్టనెలేదు

అరెరే చూడుము దాని తామసము
అదరిపాటుగా లేచినగుఱ్ఱము ॥ భళీభళీ ॥
మూడేచక్రాల్ కొట్టింది
ముందుకు చెంగునదూకింది ॥ భళా ॥

దూకినగుర్రం మింట లేచెర
ధూళి ఆకసము కావు రేసెర
కన్ను మూసి కను తెరువ లేదుర
కంటికి గుర్రం కానరాదుర ॥ భళీభళీ ॥

గుట్టలు కొండలు దాటింది
పిట్టవోలె అదిపోతోంది ॥ భళా ॥

వ. ఇక నిక్కడ ప్రేక్షకు లేమనుకుంటున్నారు —

ఎంతదూరమేగినదో గుర్రం – బంతుపంతు లేదు
ఎంతసమర్థుండైన దీనిపై – నెక్కి బ్రతుక లేదు
ఎక్కడిగుర్ర మదెక్కడి వేగము – రెక్కలొక టిలేవు
ఎక్కడ యువకుని పారవేసినదో – ఏ దిశపట్టినదో!

వ. ఇక అక్కడ గుఱ్ఱం —

భళాభళానోయ్ తమ్ముడా – సై – భాయిభళానోయ్ దానాన
గుండెలదర పరుగెత్తుచు ॥ సై ॥
కొండల గుట్టల నెక్కుచు ,,
అలసిపోయి తుదకశ్వము ,,
ఆగదలచినది పాపము ,,
ఆగనివ్వ డాధీరుండు
లాగి తన్నినాడొకతన్ను ॥ భళా ॥

తన్నుకదరి ఆ గుర్రము ॥ సై ॥
తనరౌతును గుర్తించెను ,,
తక్షణమాతని ఆజ్ఞల ,,
తప్పక అది పాలించెను ,,
గన్నయ గుర్రాన్నప్పుడు
తిన్నగ వెనుకకు తిప్పాడు ॥ భళా ॥
శరవేగంబున గుర్రము ॥ సై ॥
నురుసుదొబ్బలను కక్కుచు ,,
విద్యాలయమున కప్పుడు ,,
వెళ్ళి మెల్లగా నిలచెను ,,
గన్నయ క్రిందికి దిగినాడూ
వెన్నుచరచి తనగుర్రాన్ని ॥ భళా ॥

వ. గన్నారెడ్డిని చూడగానే ప్రేక్షకులు కరతాళ ధ్వనులుచేసి, ఆ మహాయోధుని వేనోళ్ళ శ్లాఘించారు. తరువాత విద్యార్థుల సభలో రుద్రమ దేవి ఏమని ఉపన్యసించింది—

యువకులార విద్యార్థుల్లారా - యోధాగ్రణులార
నవనీత హృదయుల్లారా మన గ - న్నయ్యకు సరితూగు
వీరయువకులకు కొదువలేదు మన - వీరభూమిలోన
ఆరయుడీ నేడున్నస్థితి నాం - ధ్రాభిమానులార
పాడిపంటలకు నిలయమైన మన - పచ్చని దేశమును
నేడు దోచుకొనిపోవదలంచెడు - నీచాత్ములు కలరు
దేవగిరిని పాలించు ఆ మహా - దేవరాజు నేడు
తీవ్రప్రయత్నము చేయసాగె మన - దేశమాక్రమింప

ఆతని జీకొని చూపి కలన మీ - రాంధ్రపౌరుషంబు
జాతిగౌరవంబును మనదేశ - స్వాతంత్ర్యము బ్రోచి
వీరులాంధ్రులను శాశ్వతకీర్తిని - ధారుణి నిలుపండి
వేరొక విషయము తెల్పెదనిప్పుడు - వినుడు శ్రద్ధగాను
కొందరు ప్రముఖులు స్వార్థసిద్ధికై - కుట్రలేవొపన్ని
అందలమెక్కదలంచిరి దేశం - బెందుకు వారలకు
నందనవనమున గచ్చపొదలు ఈ - నాడు వీరెసుమ్మ
తొందరగా పెకలించి గచ్చలను - తోట బాగుచేయు
భారము మీదే గ్రహించండి ఓ - భావిపౌరులార
మీరిక దేశద్రోహులందరిని - ఏరివేయుడనుచు
తన సంభాషణ నాపుజేసె నా - తన్వి రుద్రమాంబ

వ. తరువాత నామె విద్యార్థు లందరకు తగిన కానుక లిచ్చింది. వీరయోధుడైన గన్నారెడ్డికి ఆ గుర్రాన్ని బహూకరించి తన మందిరానికి వెళ్ళింది.

ప్రశ్న: అది సరేగాని ఈ గన్నారెడ్డి ఎవర్రా?

జవాబు: ఈయన వర్ధమానపుర సామంతరాజైన గోన బుద్ధారెడ్డి తనయుడు. ఆయన చనిపోతూ రాజ్యాన్నీ, తన కుమారుణ్ణీ లకుమయారెడ్డికి ఒప్పగించాడు. ఈయన—

బుద్ధారెడ్డికి తమ్ముడితనికీ - వృద్ధాప్యమువచ్చె
వృద్ధాప్యములో నుద్భవించె దు - ర్బుద్ధి రానురాను
అన్నకుమారుని రాజ్యంబును తా - నపహరించదలచి
పన్నెను కుట్రలు కొంతవరకు అవి - ఫలించినవికూడ

అదనుజూచి తన అన్నకుమారుని – హనుమకొండ కితడు
చదువుసాకుతో మెల్లమెల్లగా – సాగనంపినాడు

వ. క్రమంగా గన్నారెడ్డికి ధనం పంపటం మానివేశాడు. అంతటితో తృప్తిపడక రుద్రమదేవిని సింహాసనం దించాలనే సామంతరాజులకు నాయకత్వంకూడా వహించాడు.

ప్రశ్న: అదటరా సంగతి; ఇందుకనేనా రుద్రమదేవి విద్యార్థులతో అట్లా చెప్పింది.

జవాబు: అవును. ఈ దేశద్రోహుల కుట్రలను తన వేగులవాళ్ల ద్వారా రుద్రమదేవి తెలుసుకొని తగిన జాగ్రత్తలు తీసుకొంటూవుంది. కనుకనే ఆసభలో భావిపౌరులైన విద్యార్థులకు హెచ్చరిక చేసింది.

ప్రశ్న: సరే, ఆమె చెప్పాలిసింది చెప్పిందనుకో. ఇంతకూ ఈ విద్యార్థులు చేసింది ఏమైనావుందా, లేదా—

కథకుడు:— ఎందుకు చేయలా, వెంటనే గన్నారెడ్డి విద్యాలయానికి సెలవుపెట్టి, రుద్రమదేవి తనకు బహూకరించిన గుర్రముపై ఎటో సంచారం వెళ్లాడు. కొన్నాళ్లకు తిరిగివచ్చి తమ విద్యాలయం ప్రక్కనున్న గుట్టమీద కూర్చుని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. ఇంతలో గన్నారెడ్డి ఆప్తమిత్రులైన కొందరు విద్యార్థులు అక్కడకువచ్చి అన్నా గన్నారెడ్డీ—

కీర్తన

విద్యా:- విషయమేమిటన్న – వివరముగ తెలుపుమన్న
అతిదీర్ఘముగా నేదో – ఆలోచిస్తున్నావు

పినతండ్రిగారు నీకు – ధనమేమి పంపలేద
అత్యాశాపీడితుడై – ఆతడు నీ రాజ్యంబును
అపహరించెననువదంతి – విన్నా మదినిజమేన ॥ విషయ ॥

గన్నా:– వినుడు మిత్రులార – విశ్వాసపాత్రులార
రాజ్యచింత యేలమనకు – రాజభోగ మెందులకు
స్వాతంత్ర్యం సౌభాగ్యం – జాతీయత నశియించి
బానిసత్వమనునరకం – పాలౌ దౌర్భాగ్యులకు ॥ రాజ్య ॥

విద్యా:– విషయమేమిటన్న – వివరముగ తెలుపుమన్న
ఆంధ్రపుత్రులము మనము – అన్నా బ్రతికున్నాము
పోరాటంబున రుధిరము – ధారపోసి మాతృదేశ
స్వాతంత్ర్యము కాపాడగ – సంసిద్ధముగా నుంటిమి ॥విషయ॥

అనిపల్కెడి తన మిత్రులగని గ – న్నయ్య తెలిపె నిటుల
విను డోకప్రమాదమిప్పుడు వచ్చెను – మన దేశంబునకు
స్వార్థులు కొందరు దేశద్రోహులుగా – సామంతులు గలిసి
పార్థివుడామహాదేవరాజునకు – బాసటగా నిలచి
మాతృద్రోహమునకు పాల్పడి రీ – మదోన్మత్తులార
ఈ తరుణంబున మనకర్తవ్యం – బేమొ తెలిసికొనుడు

వ. దేవగిరి పరిపాలకుడైన మహాదేవరాజు మన తెలుగు దేశానికి బద్ధశత్రువు. వాళ్లకూ, మనకూ తాతలనాటి పగలున్నాయ్. పాతకక్ష తీర్చుకోటానికి తగిన అవకాశం దొరికిందని అత డువ్విళ్లూరుతున్నాడు. దురాశాపరులైన ఈసామంత రాజులను చేరదీసి, ఎవడికి వాడికే నిన్నురాజును చేస్తానని చెప్తున్నాడు.

మహారాణి రుద్రమ ఆడుదిగనుక, ఆమెకు సామంత రాజులుగా వుండటం, తమ గౌరవానికి భంగమని వీరు ప్రచారం కూడా ప్రారంభించారు. చక్రవర్తి సమర్థత, పరిపాలనా విధానంలోని మంచి మనసు కావాలి. అంతేగాని స్త్రీయా, పురుషుడా అనేదిగాదు. కాబట్టి—

మీ రెరుంగరే రుద్రమ్మకు గల - పేరుప్రతిష్ఠలను
వీరాంగన పరిపాలన ప్రారం - భించిన దాదిగను
జాతీయత నభివృద్ధిచేసి మన - జాతిని మేల్కొలిపి
జాతిమత ద్వేషానలకీలల - చల్లార్చుచునుండె
కవుల గాయకుల కళాకారులను - గౌరవించుచుండె
వ్యవసాయము నభివృద్ధిచేసె కా - రడవులు కొట్టించి
కూపతటాకంబులు త్రవ్వించెను - కొన్నిటి నిప్పటికె
స్థాపించిన దిప్డు డెన్నో విద్యా - సంస్థల నందందు
విదేశాలతో వాణిజ్యము నభి - వృద్ధి చేయసాగె
కదలి పల్లెలకు అచ్చటి సుఖ దుః - ఖముల నరయుచుండె

వ. ఇట్టి మన మహారాణియైన రుద్రమదేవిని ఈ నీచులు సింహాసనం దించాలని కలలు కంటున్నారు. మాపినతండ్రి లకుమయారెడ్డిగారు ఈద్రోహులకు నాయకత్వంవహించారట—

అని పల్కుచు ఖడ్గంబుదూసి గ - న్నయ్య మండిపడుచు
వినుడు, వినుడు నా ప్రతిజ్ఞనిప్పుడు - వీరయువకులార
తండ్రిగాని పినతండ్రిగాని ఆ - దైవమైనగాని
తుండ్రించగ వెనుకాడను దేశ - ద్రోహితలను ఖరకు

అత్తరి నాయుపకాగ్రగణ్యులు - తందానా తందాని తందన
నెత్తురుడికి తమ కత్తులుదూసి ,,
అన్నా వినుమో గన్నారెడ్డీ ,,
ఆహవమున నీకండగ నిలచి ,,
మారక్తము తర్పణలిచ్చెద మీ - మాతృదేశమునకు
|| తందాన ||

వ. అని పలికి ఆ వీరయోధులు తమ తమ ఖడ్గములంటి శపథం చేశారు.

అప్పుడు గన్నారెడ్డి - సోదరులారా మన శత్రువులు లోలోన గోతులు త్రవ్వుతూ, పైకి పెద్దమనుష్యుల్లాగ నటిస్తున్నారు. మనమిక్కడవుండి వాళ్ళను సాధించటం కష్టం. అందుకనే నేను మనమంతా రహస్యంగావుండి, ఈ ద్రోహులను అణచటానికి తగినస్థలాన్ని చూచివచ్చాను. ఎక్కడంటారా?

శాతవాహనులనాడు కట్టిన పు - రాతనమగుకోట
ఓ తమ్ముళ్లారా మనరక్షణ - కున్న దొక్కచోట
అతిరమ్యంబగు నల్లమలలయం - దా దుర్గము కలదు
శత్రువు లాస్థలమున కాలిడుటకు - సాహసించ లేరు
కూడి అందరము గజదొంగలవలె - క్రుమ్మరుచూ అచట
దాడిచేసి దేశద్రోహుల వే - టాడవలెను లెండు

వ. మన వీరయువకులారాత్రియే బయలుదేరి నల్లమలల లోని ఆ కోటకు చేరుకున్నారు. ఎట్లా వుంటుందాప్రదేశం---

ఆ కొండల వరుసలు మబ్బులతో - నాటలాడుచుండు
కీకారణ్యం బాపెనుగొండల - నాక్రమించివైచె

మోకులు తిరుగని మాకులు మద్దులు - టేకులు మారేళ్లు
ఏ కడజూచిన నెదురుగుమ్ము లిం - కెన్నెన్నో చెట్లు
జిల్లేళ్ళూ గురివిందలు గచ్చలు - చిత్రమైన పొదలు
అల్లిబిల్లిగా నల్లుకొన్న వా - నల్లమలలపైన
కాకిఘూకములు కారెనుబోతులు - భీకర సర్పములు
బూకరించు పందులు గాండ్రిలు బె - బ్బులులు చిరుతగంట్లు
కోరాడుచు విహరించుచుండు నా - ఘోరారణ్యమున

వ. దేశసేవాతత్పరులైన వీరయోధులుతప్ప, సామాన్య మానవు లాభయంకరారణ్యములో కాలుపెట్టనూలేరు, మృత్యువుతో పోరాడనూలేరు.

వీరయోధుడైన గన్నారెడ్డికి, అతని తమ్ముడైన విఠల ధరణీశుడు, ప్రాణమిత్రుడైన సూరనరెడ్డి కుడి ఎడమ భుజాలుగా ఉండి పనిచేస్తున్నారు.

ఆ ప్రదేశంలో చెంచులు, కోయలు మొదలైన అడవి జాతులవారు నివసించుతూ వుంటారు. గన్నారెడ్డి వాళ్ల నెంతగానో ఆదరించాడు. వాళ్ళూ ఆయనను ప్రాణతుల్యంగా ప్రేమించారు. గన్నారెడ్డి జట్టులోని కొందరుయువకులు మారువేషాలతో తిరుగుబాటుదారుల కుట్రలను కనిపెడుతూ, ఆయాప్రదేశాలలో తిరుగుతున్నారు. ఆ సామంతరాజులు గన్నారెడ్డిని సామాన్య మానవునిగా భావించి, తమ కార్యకలాపాలను యథేచ్ఛగా సాగిస్తూనే వున్నారు.

ఈ పెద్దమనుష్యులంతా ఒకనాడు వర్థమానపురంలో సమావేశమయ్యారు. ఆ సమావేశంలో లకుమయారెడ్డి మంత్రియైన రుద్రయ్య లేచి--

విన్నారా! లకుమయారెడ్డిగారు! తంధానో
గన్నారెడ్డి గజదొంగగ మారాడు ,,
గోనవారికొక మచ్చ తెచ్చినాడు ,,
దానికి మనమిపు డేమిచేయగలము ,,
నే డీరుద్రమ విషయం తేల్చండి ,,
తందన భాయీ దేవనందనాన తందానతాన

అప్పుడు లకుమయ లేచి పలికెనిటుల ,,
అనఘులార సామంతులార వినుడు ,,
ఆంధ్ర మహాసామ్రాజ్యంబున కిపుడు ,,
ఆడుది రుద్రమ చక్రవర్తియంట ,,
ఇంతమంది యోధానయోధులకును ,,
ఇంతికి మ్రొక్కేడి దుర్గతిపట్టింది ,,
తందన భాయీ దేవనందనాన తందానతాన

పరువుప్రతిష్ఠలుగల పురుషుం డెవడు ,,
భరించలేడీయవమానము నేడు ,,
అతివ తెలివితేటలుగలదై తేను ,,
పుత్రులగని పోషించాలంతేను ,,
కూడదు రాజ్యంచేయుట చేజేయను ,,
తోడనె ఆమెను దించవలెను గద్దె ,,
తందన భాయీ దేవనందనాన తందానతాన

వెరువనేల నిక తిరుగుబాటు చేయ తందాన
హరిహర మురారిదేవులు మనపక్షం ,,
బిరానదురమున దూకండన్నాడు ,,

విజయము మనదేనని కూర్చున్నాడు ,,
తందన భాయీ దేవనందనాన తందానతాన

వ. సభకు వచ్చిన సామంతరాజులంతా లకుమయా రెడ్డితో ఏకీభవించారు. రుద్రమదేవిని సింహాసనం దించాలంటే తమకు మహాదేవరాజు సహాయం ఎంతో అవసరం గనుక, తక్షణమే రుద్రయమంత్రిని దేవగిరికి పంపాలని నిశ్చయించారు. దానితో సభ ముగిసింది.

తరువాత లకుమయారెడ్డి ప్రభువూ, మంత్రి రుద్రయ్యా ఏకాంతంగా కూర్చుని కొంతసేపు మాట్లాడుకున్నారు. ఆదవోని (ఆదోని) కోటారెడ్డి దిట్టమైన సామంతరాజు. అతడు మనపక్షాన వుంటే ఎంతయినా లాభముంది. కాని అతడు వూగిసలాడుతున్నాడు. ఏమిటి ఉపాయం అన్నాడు లకుమయారెడ్డి.

అప్పుడు రుద్రయ మంత్రి నవ్వి అంటాడుగదా. అదెంత పని ప్రభూ!

కోటారెడ్డికి అన్నాంబికయను -- కుమార్తె కలదండి
కోటారెడ్డి కుమార్తెనూ తమ – కుమారునకు నేను
పెండ్లి జరుగుమార్గము జూచిన ఈ – బెడద వదలునండి
పెండ్లిరాయబారము వేగమె పం – పించం డన్నాడు

వ. రాజు మంత్రిగారిచ్చిన సలహాకు చాలా సంతోషించి, ఆ పిల్లను మీరెప్పుడు చూశారు అని అడిగాడు —

ఈ మధ్య నన్నక్కడికి రాజకీయాలు మాట్లాడటానికి పంపించారుగదా ? అప్పుడు ఆపిల్లను చూడటం తటస్థించింది అన్నాడాయన.

నిక్కమామె సోయగమింతని నే - నెక్కడ వర్ణింతు
చుక్కలరాయని ధిక్కరించు బహు - చక్కని వదనంబు
కుందన పుష్పము లామె దంతములు - కురులు నీలమణులు
మందగమన ఆసతి నేత్రము లర - విందము లోస్వామి
సందేహము లేదందమంత ఆ - ఇందువదన సొమ్మె
ముందు వివాహ ప్రయత్నము చేయం - డెందుకుజాగు ప్రభు.

వ. అంతేకాదు, కోటారెడ్డి తన ఏకైక పుత్రికయైన అన్నాంబికకు గుర్రపుస్వారి, కత్తిసాము మొదలుగాగల యుద్ధ విద్యలుకూడా నేర్పించారన్నాడు. ఇది విని లకుమయారెడ్డి పరమానందభరితుడై నేను కోటారెడ్డితో సంబంధం కుదుర్చు కొనే ప్రయత్నంలో వుంటాను. వెంటనే మీరు దేవగిరికి వెళ్లి రండి అన్నాడు. ఇక రుద్రయమంత్రి దేవగిరికి ఎలా బయలు దేరుతున్నాడు—

కాశికి జను యాత్రికుని వేషమున - కదలె రహస్యముగ
దేశద్రోహి సిబ్బందితో సహా - దేవగిరికి తెగువ
మైదానము లడవులు దాటుచు గ్రా - మంబు లెన్నొ గడచి
గోదావరినదినీ ఎల్లోరా - కొండ లధిగమించి
వడిగ దేవగిరిజేరి భవానీ - భట్టు యింటిలోన
విడిదిజేసి విందారగించె నా - విప్రుం డారాత్రి

వ. ఈ భవానీభట్టు మహాదేవరాజునకు మంత్రి. మరు నాడు రుద్రయ్య మహాదేవరాజును చూడటానికి భవానీ భట్టుతో కలసి రాజసభకు వెళ్లాడు. రాజతనకి ఉచితాసనం యిచ్చి గౌరవించి విశేషాలడిగాడు. అప్పుడు రుద్రయ్యామంత్రి రాజుతో అంటాడూ—

కీర్తన

జాగేల లేవయ్య – వేవేగ రావయ్య
ఓ రాజమార్తాండ – ఓహో గండరగండ ‖ జా ‖
తెలుగు దేశములోన – కలత లధికముజేసి
ఈనాడు మీరాక – కెదురుచూస్తున్నాము ‖ జా ‖
పడతి రుద్రమదేవి – బ్రతుకెంత మనముందు
దండు కదిలించండి – అండ మేమున్నాము ‖ జా ‖

అని స్తుతియించెడి రుద్రయపల్కులు – నాలకించి రాజు
తనమదిపొంగుచు మీసముద్రిప్పుచు – అనె నాతనితోడ
అతివపైకి యుద్ధమునకు రా రీ – యాదవరాజులని
అతితెలివిగ నందలమెక్కించిరి – ఆంధ్రు లాడుదాన్ని
ఈగతి నాడుది రాజ్యముసేయుట – ఎందైనను గలదె
వేగమె మేమరుదెంచి ఆంధ్రులకు – విముక్తినిచ్చెదము
అభయదాన మిదిగోయిచ్చితి మా – అస్త్రుల కీవేళ
శుభముహూర్తమును చూసివచ్చి నే – చూపెద మత్ప్రతిభ

వ. తరువాత రుద్రయమంత్రి మహదేవరాజుగారిచ్చిన కానుక లందుకొని, రాత్రిళ్ళు ప్రయాణంచేస్తూ, పగలు ఎక్కడో ఒకచోట మకాంచేస్తూ, మెల్లగా వర్ధమానపురం చేరుకుంటు న్నాడు. ఒకనాడు ఉద్రపముఖుడు బొలినపాడు అనే గ్రామంలో బసచేసి ఉండగా—

గన్నప్రభు వొకదళముతోడ ఆ – గ్రామమునకు వచ్చి
తిన్నగ జని రుద్రయ్యమంత్రిగా – రున్న ఇల్లుసొచ్చి
దేవగిరియనే కాశినుంచి చను – దెంచు మంత్రిగారు
మా విడిదికి దయసేయం డిదె స – న్మానమందుకొండి

తొందరగా నడువం డోస్వామీ – ఎందుకు జాగనుచు
బందీగా తనకోటకప్పు డా – ప్రముఖుని గొనిపోయె

వ. ఇక్కడ రుద్రయ్యామంత్రి గోన గన్నారెడ్డికి చిక్కాడు. అక్కడ లకుమయారెడ్డి కుమారుడైన వరదారెడ్డికీ, ఆదవోని కోటారెడ్డి కుమార్తెయైన అన్నాంబికకూ వివాహం నిశ్చయమైంది. వెంటనే కోటారెడ్డి అంతఃపురానికి వెళ్ళి యీ శుభవార్త తనభార్యతో చెప్పాడు. ఆమె పొంగిపోయింది. పిదప వారిద్దరూకలిసి అన్నాంబిక గదికి వెళ్ళారు. రాజు కుమార్తెను చూచి – అమ్మా!

అదృష్టమంటే నీదేనమ్మా – అమ్మా వినవమ్మ
వెదకిన దొరుకదు సంబంధం బీ – విధముగ నెవ్వరికి

తానే స్వయముగ వచ్చి నిన్ను తన – తనయున కిమ్మనుచు
గోన లకుమయారెడ్డిగారు నను – కోరినారు తల్లి

శుభస్య శీఘ్రంబని తగు సమయము – చూచి బుధుల పిలచి
శుభలగ్నము పెట్టించినాము మే – ముభయులమును కలసి

అని పలికెడి తనతండ్రికి వందన – మాచరించి ఆమె
విని నామనవి వివాహ ప్రయత్నము – విరమించండ నేను

వ. కుమార్తె ఆ విధంగా మాట్లాడేసరికి కోటారెడ్డి విస్తుపోయాడు. ఏంవిటమ్మా! అట్లా అంటావన్నది తల్లి. అప్పుడామె తల్లిని చూచి – అమ్మా!

ఇష్టములేని వివాహముచేయకు – డిన్నినాళ్ళు పెంచి
దుష్టుం డీప్రభువని స్పష్టముగా – తోచుచుండె నాకు

అన్నకుమారుని సర్వసంపదల - నపహరించినట్టి
ఇన్నరపతిపుత్రుని పతిగా నే - న్నెట్లు స్వీకరింతు

వ. అనిన కుమార్తె మాటలకు కోటారెడ్డికి కోపం వచ్చింది. కాని తమాయించుకొని ఇలా అన్నాడు. గోన లకుమయారెడ్డిగారు ఎంతగొప్పవారో నీకు తెలియదు. ఒక ఆడుది మన తెలుగుదేశాన్ని పరిపాలించటం జూచి, ఆయన ఎంతగానో బాధపడుతున్నారు. కనుక వెంటనే రుద్రమదేవిని సింహాసనం దించాలని విశ్వప్రయత్నాలు చేస్తున్నారు.

ఈ పని తొందరలోనే పూర్తిఅవుతుంది. తరువాత ఓరుగల్లు సింహాసన మధిష్ఠించగల సమర్థు లాలకుమయారెడ్డిగారే. అట్లాంటి చక్రవర్తికి కోడలివి కానున్నావమ్మా"అన్నాడు. తండ్రి మాట లామెచెవులకు ములుకులై నాటినై. అప్పుడు—

పాట

పడతి దిగ్గునలేచి - పలికె తండ్రిని చూచి
ప్రజల బిడ్డలకరణి - భావించు ఒకరమణి

రాజ్యాన్ని శాసించరాదంట

ఈ

రాజులందుకు తగినవారంట

ఈ కుట్రదారులను - ఈ దేశద్రోహులను
కనిపెట్టగలయుక్తి - దునుమాడగలశక్తి

మగువ రుద్రమకున్న దోతండ్రి

కుట్ర

మాని, సన్మార్గమున నడువండి

అని పల్కి తనపట్టి - వదలించి లేదు
కనుల నిప్పులురాల్చి - గర్జించినాడు
కన్నతండ్రిని నన్ను - కాదని నీవు
సన్నసన్నగ యేమొ - సణుగుచున్నావు
ఈ రాజకీయంబు - లెందు నేర్చితివి
పారాయణముచేయ - బయలుదేరితివి
తిరుగులేదిక పెండ్లి - జరిపితీరెదను
హరిహరాదులువచ్చి - ఆపనెంచినను
అనుచు పెద్దగరంకె - లాతడు వేసి
చనె నొడుగరచి ఆ - స్థలమెడబాసి

వ. ఆ విధంగా మండిపడుతూ తన భర్త వెళ్ళిపోవడం చూచి, అన్నాంబికతల్లి భయపడింది. కుమార్తె కేవో ఓదార్పు మాటలుచెప్పి, తలనిమిరి వెళ్ళిపోయింది.

చాటునవుండి యిదంతా చూస్తున్న అన్నాంబిక చెలికత్తె యైన మల్లిక అక్కడకువచ్చింది. ఆమెను చూచి అన్నాంబిక అంటుందిగదా, మల్లికా—

రాజకీయ జూదమున పాచికల! - రాజకన్య లకట
స్త్రీజాతికి మోక్షములేదా మన - జీవిత మింతేన
ఇంటికుక్కకున్నంత విలువ నే - డింటికి లేదమ్మ
అంటగట్టెదరు యెవ్వనికో తమ - యనుకూలము చూచి
చావుమేలు ఒకద్రోహికి సతినై - జీవించుటకన్న
సేవజేయు టుచితము ప్రజలకు నా - చేయగలిగినంత
ఈ వివాహ మోచెలియా తప్పు ట - దెట్లో తెల్పుమనిన
ఆ విషయము వదలండి నాకు మీ - రని మల్లిక పలికె

వ. ఈవిధంగా కొంతతడవు వారిద్దరూ ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు. తదుపరి అన్నాంబిక, యీా వివాహానికి అంగీకరించినట్లు నటించడం మొదలుపెట్టింది. ఇదిచూచి కోటారెడ్డి పొంగిపోయాడు. తుద కారోజు వచ్చింది. ఆదవోని (ఆదోని)కి పెండ్లివారు దిగారు.

పెండ్లివారలవెంట తాని తందన తాన
పెదపెద్ద దొరలంట ,,
కందనోలుకు రేడు ,,
పంది భూపాలుఁడు ,,
కందూరి నాయకుడు ,,
కల్యాణపుర ధవుడు ,,
ఎందరెందరొ వచ్చిదిగినారు
పందిరంతయు నిండిపోయారు
ప్రభువులా దర్జాలు తాని తందన తాన
బలె బలే వేషాలు ,,
పెద పెద్ద మీసాలు ,,
పెంచినా గడ్డాలు ,,
నీలైన గిరజాలు ,,
నిండు తలపాగాలు ,,
ముత్యాల హారాలు ,,
ముద్దుటుంగరాలు ,,
పెండ్లి కందంవారె తెచ్చారు
ఇంక
పెండ్లి ప్రారంభించమన్నారు.

వ. వెంటనే దాదులు పెండ్లికుమార్తెను తీసుకురావ డానికి లోనికి వెళ్లారు. కాని అన్నాంబిక, మల్లికలు ఆ గదిలో లేరు. ఎక్కడ వెదకినా కనుపించలేదు. తుదకు వారి ఆనంద మంతా దుఃఖంగా మారిపోయింది. అన్నాంబికతల్లి కుమార్తెను తలచుకొని, అమ్మా! అన్నాంబికా!

ఎందేగితివో బిడ్డా! ఒంటిగ – యేమైపోయావో
మందమతులమై నీ మాటలు విన – నందుక యీ శిక్ష
అన్నమ్మా మమ్ము క్షమింతువని – ఆశపడితినమ్మ
కన్నతండ్రిమూర్ఖత్వమె దీనికి – కారణమా తల్లి
ఏమైతివో మమ్మేమనుచుంటివో – ఎట్టెట్టులున్నావో
ఏమిసేతునని ఏడ్చిఏడ్చి తుద – కామె మూర్ఛమునిగె

వ. ఇక నక్కడ పెండ్లిపందిరిలో సామంతరాజులంతా సమావేశమయ్యారు.

కోటారెడ్డియవమానముతో – కుమిలిపోవసాగె
కాటువేసినను రక్తములే దా – ఘనుని ముఖముమీద
పాణిగ్రహణంబును తనయెత్తులు – భగ్నమగుట జూచి
గోన లకుమయారెడ్డి ఖిన్నుడై – కూలిపోయినాడు

వ. అప్పుడక్కడకు ఒక భటుడు వచ్చి, తన ప్రభువైన లకుమయారెడ్డిని చూచి – ప్రభూ!

కాశినుంచి తా కదలివచ్చుతరి తందానా తందాని తందన
మన రుద్రయ్యను – మంత్రిశేఖరుని ,,
ఖైదుచేసి ఆ – గన్నారెడ్డి ,,
కదలిపోయినాడట మహాప్రభో–కారడవుల కతడు ॥తం॥

వ. మార్కాపుర ఉప్పలసోముడు కత్తియుద్ధంలో ఘటికుడని పేరుగడించినవాడు. అతడీవార్త విని —

ఉప్పల సోముడు కనలుచు కన్నుల - నిప్పులు రాల్చుచును
అప్పుడు యిట్లనిపల్కెను భూ - పతులందరు వినుచుండ
వినుడు వినుడీ నాదు శపథం
కనుడు కనుడిక నా ప్రతాపం
గట్టిగా గన్నయను పడతాను - లకుమయ్యగారు
పట్టి వేగమె కట్టితెస్తాను ,,
తెచ్చి యిచ్చట నిలువబెడతాను ,,
నిలిపి నీచుని తలను కొడతాను ,,
కొట్టి కోటకు వ్రేలగడతాను ,,
గిరగిరా మీసంబు త్రిప్పుచు - మొనగాడు సోముడు
బాకుదూసి ప్రతినబూనాడు ,,

వ. ఈ విషయం వేగులవాళ్ళద్వారా గన్నారెడ్డి సైనికులు తెలుసుకొని వచ్చి, చెట్లలోదాగికూర్చున్నారు. ఉప్పల సోముడు ఎప్పుడు వస్తాడాఅని ఎదురుచూస్తున్నారు. ఇంతలో మారువేషాలతో వెళుతూవున్న అన్నాంబిక, మల్లికలు వారి కంటబడ్డారు.

ఎవరు మీరని సైనికులు వారిని ప్రశ్నించారు. అప్పుడు మల్లిక, అన్నాంబికను చూపి వీరు మా యజమాని విశాలాక్షు ప్రభువులు; నాపేరు మల్లిఖార్జునరెడ్డి అని జవాబిచ్చింది. మీ రెక్కడనుంచి వస్తున్నారని విఠలధరణీశుడు వారి నడిగాడు.

మల్లిక ఇంకా వారికి జవాబివ్వనేలేదు. అటువస్తున్న ప్పల సోముని సైన్యం వారి కంటబడింది. వెంటనే విఠల ధర

ణేశుడు ఆ ప్రాంతంలో దాగివున్న తన మూడువేల సైన్యంతో ముందుకు దూకాడు. ఇది చూచి ఉప్పల సోముని సైనికులు బెదరి, కొందరు పరారయ్యారు; కొందరు విరలునకు దాసోహ మన్నారు. అప్పుడు ఉప్పల సోము డంటాడూ—

దోచితినే గజదొంగల్లారా – తందానా తందాని తందన
నీచము దారులు కాచికొట్టుటిది ,,
అధికసంఖ్యలో అసగుదెంచి మా ,,
పసుగురిపై ఇటుపడుట యధర్మము ,,
పౌరుషముంటే ఒకరొక్కరె నాపైకిరండి మీరు ॥ తందాన ॥
ఇంతలోనె ఎటునుండివచ్చెనో – వింతగ గన్నయ్య

వ. సోముని చూచి ఒరే! సోముడూ!

పంతంబున నాతల నరికెదనని – పలికిన మొనగాడ
క్షత్రియుద్ధమున మహాఘనుండని – ఖ్యాతిగన్నవాడ
ఇత్తరిజూచెద కదనంబున నే – ర్పెంతగలదొ నీకు

వ. సరే నీకోర్కె ఎందుకు కాదనాలి. ఒకవేళ యీ యుద్ధంలో నాతల నీవు నరికితే నా సైనికులుగాని, నా సోదరుడుగాని నిన్నేమీచేయరు; ఇది నా హామీ. ద్వంద్వ యుద్ధానికి సిద్ధంకమ్మన్నాడు. అప్పుడు—

తలపడి రిద్దరు సింహముల ట్ల – త్తరి కత్తులుదూసి
ఝళిపించుచు తమ కరవాలంబులు – తళతళతళ మెరయ
పోరదొడంగిరి మోఘులిద్దరును – వీరావేశమున
ఆ రణరంగప్రవీణుల యుద్ధం – బరసితీరవలెను

శూరశిఖామణి గన్నయపాదము - ధారుణిపై బడదు
భూరిబలాఢ్యుడు ఉప్పల సోముడు - బుసలుకొట్టసాగె

వ. రొప్పుతూ సోముడంటాడూ —

దారిదోపిడీ కాదిదిరెడ్డీ - ఘోరయుద్ధమోయి
చోరా యిదిగో చచ్చితివని తన - చూరకత్తి విసరె
అట్లట్లే పైకెగరగొట్టి యపు - డాకత్తిని రెడ్డి
ఇట్లనె పకపకనవ్వుచు ఘనుడా - హీనుని గనియపుడు
పదవికోసమై ప్రాకులాడు - ఓ వదరుబోతు! వినర
కదనభూమి నాచేత జిక్కితివి - గతులులేవు నీకు
దేశద్రోహీ కాచుకోర నా - దెబ్బయనుచు లేచి
నీచుని తల పృథివీస్థలిపడ తెగ - నైచెను ధీరుండు

వ. గన్నారెడ్డి ఉప్పల సోముని శరీరాన్ని సగౌరవంగా మారార్కపురం పంపించాడు. గన్నారెడ్డి శౌర్యాన్నీ, ధర్మ యుద్ధాన్నీ కన్నులారా చూస్తూవున్న అన్నాంబిక, మల్లికతో ఇలా అంది. మల్లికా!

ఎంత రూపగుణసంపన్నుండిత - డెంత ధైర్యధనుడు
హంతకుడో గజదొంగకుండునా - యింత ప్రతాపంబు
బందిపోటుదొంగకు దేశముపై - భక్తి యేమిటంత
ఇందేదో ఒక పరమరహస్యం - బిమిడి యున్నదంతె

వ. అవును, మీరు అన్నమాటలలో సందేహ మేమీ లేదు. ఈ మహాయోధుడు సోముడులాంటి దేశద్రోహులను చీల్చిచెండాడటానికే గజదొంగగా మారివుంటాడుఅంది మల్లిక.

తుదకు వారిద్దరు యీజట్టులో చేరి, దేశానికి తమచేతనైన సేవ చెయ్యాలని నిశ్చయించుకున్నారు. వెంటనే వారు గన్నారెడ్డి దగ్గరకు వెళ్లారు. మీ జట్టులో వుండటానికి అనుమతించమని విశాలాక్షప్రభువు గన్నారెడ్డి నడిగాడు. అప్పుడాయన నవ్వి—

ఎందుకంతపని నా మాటను విని - ఇంటికేగుమోయి
చంద్రబింబమునుబోలు ముఖంబది - కందిపోయె నిపుడె
అసిధారావ్రతమును జేయుచు ఈ - అరణ్యంబులోన
పసివాడవు మా వెంట తిరుగుచూ - బ్రతకలేవు నీవు

వ. అప్పు డాయువకుడందుకొని మీరు చూడవలసింది మనిషి వయసునుగాదు, సమర్థతను —

బిరబిర బిరబిర విశాలాక్షుడు
పరవడిజేసెర బాకుదూసెర
ఎడమచేత మామిడిపండల్లే
గిరగిర పైకి గిరాటు విసరెరా, ॥ భళిభళి ॥
పిడిబాకున ఆ పండునూ
నడిమికి రెండుగ నరికాడు ॥ భళానంటి ॥

బాలవీరునీ పౌరుషంబును
బాహుదర్పమును పనితనంబును
కదనపటిమనూ కార్యదీక్షనూ
కనులజూచి యువకా సెబాసని ॥ భళిభళి ॥
వీరుడవని నుతియించాడు
తనవెంట తీసుకొని వెళ్లాడు ॥భళానోయ్॥

వ. నాటినుంచి విశాలాక్ష ప్రభువు అంగరక్షకుడై కవచములా గన్నారెడ్డిని కాపాడుతున్నాడు.

ఇట్లుండ ఒకనాడు కందూరి కేశనాయకుడు రాజధనాన్ని కొల్లగొట్టాడు. అంతేగాదు; మహారాణి రుద్రమదేవిని ఆమె భటులయెదుటనే పేరెత్తి నానాదుర్భాషలాడాడు.. ఈ వార్త వరంగల్లు చేరకముందే గన్నారెడ్డికి అందింది.

కందూరి కేశనాయకుడు తన కోటను చాలా కట్టుదిట్టంగా వుంచాడు. అగడ్తలో నీరుపెట్టి అందులో మొసళ్ళను వేయించి పెంచుతున్నాడు.

ఇదంతా గన్నారెడ్డికి ముందే తెలుసు. తగిన ప్లాను వేశాడు. సైన్యసమేతంగా వెళ్ళి కందూరుకోటకు అరమైలు దూరంలోవున్న గుట్టలలో దాగివుండమని విఠలధరణీశుణ్ణి నియోగించాడు. తాను సూరన్నరెడ్డినీ, మొసలి వేటలో ప్రవీణులైన కొందరు యువకుల్నీ తీసుకొని బయలుదేరాడు.

అది నడిరాత్రి. పైగా అమావాస్యచీకటి. ఒరులకంటబడకుండా గన్నారెడ్డి కేశనాయకుని కోట కందకందగ్గరకు చేరుకున్నాడు. వెంటనే మొసలివేటగాళ్ళు అగడ్తలోకి దిగారు. మొసళ్ళువచ్చి వారిని ముట్టడించాయి. అప్పుడు—

కన్ను పొడిచినను కనిపించనియా తందానా తందాని తందన
కారుచీకటిని వీరయోధులు ,,
మునుగుచు తేలుచు మొసళ్ళనీకొని ,,
పెనగుచు తమతమ పిడిబాకులతో ,,
క్రూరజంతువుల పొడిచిపొడిచి పడ గూల్చసాగినారు

నీటిలోని పోరాటపుసందడి  తందానా తందాని తందన
కోటగోడపై కునుకుచు తిరిగెడి ,,
సైనికుండు విని చకచకచక చని ,,
సందడియగు నాస్థలమున యాగి ,,
అగడ్తలోనికి చూచి యెవ్వరని – అరచునంతలోన

శూరుడు సూరనరెడ్డి బాణమును – సూటిగ విడిచెనటు
నారస మాసైనికుని గుండెలో – నాటుకొనెను పోయి
కుప్పవోలె నాతం డగడ్తలో – కూలె గుభిల్లుమని
అప్పటి కాజంతువులన్నిటి వే – టాడుట ముగిసింది

వ. కాని యీ పనిలో వజ్రాలలాంటి కొంతమంది యోధుల్ని గన్నారెడ్డి పోగొట్టుకున్నాడు. విచారించి లాభం లేదు. ఆలస్యంచేస్తే కార్యభంగం అవుతుంది. వెంటనే ఉడుం సహాయంతో కోటగోడ లెక్కారు. మెల్లమెల్లగా సింహద్వారం దరిదాపులకు చేరి అకస్మాత్తుగా అక్కడవున్న సైనికులమీద పడ్డారు. కోట తలుపు తెరిచారు.

ఈ గల్లంతుకు కోటలోని సైనికులంతా లేచి, హడావుడిగా ఆయుధాలందుకొని పరుగుపరుగున సింహద్వారం వద్దకు వచ్చి పడ్డారు—

పదుగురె యోధులు వచ్చిపడెడి ఆ – బలగంబును తాకి
గదిమిగదిమి పడగూల్చసాగి రా – కదనపటిమ యేమొ

వ. కాని కేశనాయకుని సైన్యాలు తండోపతండాలుగా వచ్చిపడుతున్నాయి. వాళ్ళు యేవిధంగానైనాసరే కోట సింహ

ద్వారం మూయాలని ప్రయత్నిస్తున్నారు. మిగిలివున్న గన్నారెడ్డి మనుషులలో మరిముగ్గురు పడిపోయారు. అప్పుడు—

కన్నుల నగ్నికణంబులు గురియుచు – ఖడ్గము ఝుళిపించి
గన్నారెడ్డి సైరుల నెడాపెడ – గదిమి కూల్చసాగె
దురమున సూరనరెడ్డి వుగ్రుడై – మెరపుతీగవోలె
అరిమూలకలపై దూకి శిరస్సులు – తరిగిపోయుచుండె.

వ. ఇంతలో—

వాయువేగమున వచ్చి సేనతో – వ్రాలిన విరలుండు
పాయపాయలుగజేసి కూల్చె నా – పగతుర సైన్యముల

వ. ఆ మహాయోధుల ధాటికి తట్టుకోలేక కేశనాయకుని సైన్యాలు నలుదిక్కులకు చెల్లాచెదరైనాయి. అప్పుడే నిద్ర మేల్కొన్న కేశనాయకుడు—

పట పట పట పట – పండ్లుగొరికెరా – కేశనాయకుండు
గుట గుట గుట గుట – గుటకలు మ్రింగెర. – కేశనాయకుండు
అదలించుచు తన – బెదరిన సేనల – కేశనాయకుండు
ఉద్రేకపరచీ – ఉత్సాహపరచీ – కేశనాయకుండు
అదరిపడుచు తా – కదనభూమికే – కేశనాయకుండు
కదలివచ్చెరా – కాగడాలతో – కేశనాయకుండు

వ. ఈ కాగడాల వెలుగులో గన్నారెడ్డి సైనికులకు వాళ్లు శుభ్రంగా కనబడుతున్నారు. కాని యీ యోధులు మాత్రం వాళ్లకు కనపడడంలేదు. గన్నారెడ్డి సైనికులు శత్రువుల్ని చీల్చి చెండాడుతున్నారు. అప్పుడు గన్నారెడ్డి—

ఎక్కడబోయెను కేశనాయకుం - డేడి ఏడి యనుచు
ఎక్కడజూచిన తానై నాలుగు - దిక్కులు పరికించి
కాంచివాక్కచో వానిపైకి లం - ఘించి యొడిసిపట్టి
కాంచుచుండ నిరుపక్షంబులు తల - ద్రుంచివైచినాడు

వ. ఈ దృశ్యాన్ని చూచి కేశనాయకుని సైన్యం హడలిపోయింది. వాళ్లంతా ఆయుధాలు క్రిందబెట్టి గన్నారెడ్డికి లొంగిపోయారు. కొందరు గన్నారెడ్డి సేనలో చేరారు. వెంటనే గన్నారెడ్డి ఆ కోటలోని ఏనుగులను, గుర్రాలను, ధనాన్ని స్వాధీనం చేసుకొన్నాడు. ధాన్యం, కొంతధనం ప్రజలకు పంచిపెట్టి తనకోటకు వెళ్లిపోయాడు. ప్రజలు గన్నారెడ్డిని వేనోళ్ల స్తుతించారు.

కేశనాయకుని బంధించడానికి వస్తున్న రుద్రమ సైనికులకు యీ వార్త తెలిసి వెనక్కితిరిగిపోయారు.

సైన్యసమేతంగా బయలుదేరి, లకుమయారెడ్డి కేశనాయకునికి సహాయపడటానికి వస్తున్నాడు.

ఆయనకూ యీవార్త దారిలోనే తెలిసింది. మండిపడ్డాడు. వెంటనే లకుమయారెడ్డి యీ అరణ్యామంతా గాలించి గన్నారెడ్డిని పట్టుకోమని తన సైనికుల్ని పంపాడు. తాను శ్రీశైలంలో మకాంచేసి సంతర్పణలు ప్రారంభించాడు. గన్నారెడ్డికోసం లకుమయ సైనికులు గాలించడం మొదలుపెట్టారు. గన్నారెడ్డికి ఈవార్త తెలిసి, పకపకానవ్వి అదేమిటో చూడమని తన తరఫున కొంతమంది మనుషులను పంపాడు. ఒకచోట ఉభయసైన్యాలు తారసిల్లాయి. గన్నారెడ్డి సైనికులకంటె లకుమయారెడ్డి సైనికులు ఎన్నోరెట్లు ఎక్కువగావున్నారు.

భళాభళానోయ్ తమ్ముడా - సై - భాయి భళానోయ్ దాదాన

గన్నయ మనుష్యు లపుడు ,,
కనుగొని లకుమయ సేనల ,,
వెరచినట్లు నటియించుచు ,,
వెనకకు అడుగులు వేయుచు ,,
నాలుగు భాగాలయ్యారు
నలుదిక్కుల కెగబడ్డారు ॥ భళా ॥

లకుమయ సైనికు లిదిగని ,,
పకపకపకపక నవ్వుచు ,,
గజదొంగలు దొరికారని ,,
గంతులు వేయుచు మురియుచు ,,
పారిపోకుడని అరచారు
వారిని తరుమగసాగారు ॥ భళా ॥

పరుగిడు గన్నయ మనుషులు ,,
తరిమెడు లకుమయ సేనల ,,
నడుమ నడుమ ఎదిరించుచు ,,
అడవికి మెల్లగ లాగిరి ,,
కొండలు గుట్టలు తిప్పారు
దండిలోయలో కీడ్చారు ॥ భళా ॥

నాలుగుదిక్కుల కేగిన ,,
ఆ లకుమయ బలమంతయు ,,
మాయగ లోయనుచేరెను ,,
మరలుకెట్టులో తెలియదు ,,

గందరగోళం తుదకంత
కంగుతినిరి సైనికులంత ॥ భళా ॥

భళాభళానోయ్ తమ్ముడా-సై - భాయిభళానోయ్ దాదాన

చుట్టూ గన్నయ మనుషులు ,,
గట్లపైననే చేరిరి ,,
బండలు లోయలోనికి ,,
బడబడబడ దొర్లించిరి ,,
లకుమయ సైనికు లందరు
లబలబలబలబ లాడారు ॥ భళా ॥



గుండెలలిసి లకుమయ్య సైనికులు - గొల్లున ఏడ్చుచును
కొండనొరల్లారా మీ కివె మా - దండాలన్నారు

వ. ఆయుధాలన్నీ క్రిందపడవేశారు. తన కోటలో సభ తీర్చియున్న గన్నారెడ్డికి ఈ వార్త అందింది. ఆయన నవ్వుతూ సబ్బప్రభువుని పిలిచి ఇలా అన్నాడు. ఇప్పటికి మా పిన్నయ్య సైనికుల సంగతి తేలింది. ఇక ఆయన విషయం తేలాలి. కనుక సబ్బప్రభూ ! —

వరంగల్లు పిన్నయ్య నతిథిగా - పంపవలయు మనము
త్వరగా పయనముగమ్ము ప్రభూ యీ - పని నీదన్నాడు

వ. వెంటనే సబ్బప్రభువు తనపనిలో నిమగ్నుడయ్యాడు. మరునాటికి గన్నయ్య మనుషులు యాత్రికుల వేషాలతో వచ్చి శ్రీశైలమంతా నింపారు.

సుమారు రాత్రి పదిగంటలవుతుంది. లకుమయారెడ్డి సభ చాలించటానికి సిద్ధంగా వున్నాడు. ఇంతలో సబ్బప్రభువు,

మరి నలుగురు యోధులు సన్యాసులవేషాలు ధరించి లకు
మయారెడ్డి దగ్గరకు బయలుదేరారు. ఎలా—

పాట

శివగోవిందగోవింద - బ్రహ్మాం - భజగోవిందగోవింద

కాశివిశ్వేశ్వరుని - కన్నులారాజూచి
సేవించివస్తున్న - శివభక్తులము మేము ॥ శివ ॥
క్రిందుమీదెరుగక - ముందుగతిగానక
ఎందుకిట్లానరుడ - ఎగిరెగిరి పడతావు ॥ శివ ॥
అన్యులకు నిరతంబు - హాని తలచేవాడు
తవ్వుకున్నాగోత - తానె బడతాడురా ॥ శివ ॥
మోసగించీ ఒరుల - దోచుకొన జూచేవు
రెండింటికిని చెడ్డ - రేవడవుతావురా ॥ శివ ॥
ప్రజల సుఖదుఃఖాల - భాగాలు పంచుకొని
పాలించువాడెరా - ప్రభువు ఈజగతిపై ॥ శివ ॥
ఏరాజు ఏరాజ్య - మేలబోతున్నాడొ
యీనాటిగతి నీవు - యిపుడె చూచుకోర ॥ శివ ॥

వ. అని పాడుతూవచ్చిన సన్యాసులను లకుమయారెడ్డి
సన్మానించి తమ రిప్పుడెక్కడినుండి ఎక్కడకు వెళ్ళుతున్నారని
అడిగాడు. అప్పుడా సన్యాసు లేమంటున్నారు—

కాశినుంచి రామేశ్వర మేగుచు - శ్రీశైలములోన
దేశభక్తులగు తమరున్నారని - తెలిసివచ్చినాము
శివ ప్రసాదము తెచ్చినాము ప్రభు - సేవించండనుచు
శివ ప్రసాదంబిచ్చిరి విభునకు - సేవకులకు వారు

వ. ఆ ప్రసాదాన్ని సేవించగానే మత్తెక్కి ఎక్కడివారక్కడ చొప్పకట్టల్లాగా పడిపోయారు. వెంటనే సమయానికై వేచియున్న గన్నారెడ్డి మనుష్యులు, లకుమయారెడ్డిని యెత్తుకొని మాయమయ్యారు. తరువాత లకుమయారెడ్డి, ఆయన మంత్రియైన రుద్రయ్య ఓరుగల్లు చేర్చబడ్డారు.

తరువాత కొన్నాళ్ళకు రాజేంద్రచోళుడనువాడు తెలుగు దేశంమీదికి దండెత్తి త్రిపురాంతకం పట్టుకున్నాడు. ఏరువనాడు (ఇప్పుడున్న కడప, కర్నూలు ప్రాంతంలోని భాగం) జయించాడు. ఇప్పుడు కృష్ణదాటి ఓరుగల్లు ముట్టడించాలని అతని తలంపు. అతడు తన బ్రహ్మాండమైన గజబలంతోను, సైన్యంతోను బయలుదేరాడు. గన్నారెడ్డికి యీవార్త తెలిసి, తన మిత్రులతో అంటాడూ—

వీరులార రాజేంద్రచోళుం డ - పారబలముతోడ
పోరాటమునకు వచ్చుచునున్నా - డోరుగల్లుపైకి
ఘోరరణంబున శత్రుసైన్యమును - కూల్చి తరిమికొట్టి
వీర లాంధ్రులను పేరుప్రతిష్ఠలు - ధారుణి నిలుపండి

వ. గన్నారెడ్డి తన సైనికులను ఉత్సాహపరిచాడు. అప్పటి కాయన లక్షసైన్యాన్ని సమీకరించగలిగాడు. ఇప్పుడు 50 వేల సైన్యాన్ని తనతో తీసుకొని లక్షసైన్యంతోను, 10 వేల ఏనుగులతోను వస్తూవున్న రాజేంద్రచోళుని ఎదిరించడానికి బయలుదేరాడు. కృష్ణకు యీవలఒడ్డున సంగమేశ్వరానికిదిగువగా గట్లలో, చెట్లలో తన సైన్యాన్ని దాచి వేచివున్నాడు.

ఆంధ్రుల యుద్ధపటిమ తెలిసిన రాజేంద్రచోళుడు ఆవలి ఒడ్డును చేరి, ముందు ఆరితేరిన పిలుకాండ్రను కృష్ణలోకి దించాడు. వారు నిరపాయంగా నది ఈవలి ఒడ్డునుచేరి, ఇక్కడ అపాయమేమీ లేదని తెలియజేయటానికి కొమ్ములూదారు. వెంటనే రాజేంద్రచోళుడు తన గజబలాన్ని నదిలోకి దించాడు. అవి నదిమధ్యకు వచ్చాయి. అప్పుడు—

భళానోయ్ భాయితమ్ముడూ – సై – భాయిభళానోయ్ దాదాన

ధణధణ రుంజలు మ్రోగెను ॥ సై ॥
రణభేరీ గర్జించెను ,,
గట్లను చెట్లను దాగిన ,,
గన్నయ సైనికు లరచుచు ,,
నేలయీనిన విధంబుగా
కాలరుద్రులై లేచారు ॥ భళా ॥

వ. లేచి —

గజములపైకి రయంబున ॥ సై ॥
గంధకబాణాల్ విడచిరి ,,
భుగభుగ పొగలెగజిమ్ముచు ,,
భగభగభగభగ మండుచు ,,
బాణాల్ తాకిన గజములు
పరుగులు వురుకులు పెడతాయి ॥ భళా ॥
అటువైపున విరలేశుడు ॥ సై ॥
ఇటువైపున సూరన్నరా ,,
సబ్బప్రభు వొకదిక్కున ,,

సైన్యాల్ నడుపుచునుండిరి ॥ సై ॥
కన్నులజూడా లావేళ
గన్నయగుర్రం పరవళ్లు ॥ భళా ॥
గన్నయగుర్రంమీదికి ॥ సై ॥
గజమును తోలెను చోళుడు ,,
గజమును తప్పుకొనుటలో ,,
కాలికి శవమూ తగులగా ,,
తూలెను అశ్వం ముందుకు
నేలపైనబడె గన్నయ్య ॥ భళా ॥

పడిపోయిన గన్నయ్యమీది కదె – పాదమెత్తె గజము
పడబోవుచునున్నది కరిపాదము – ప్రభువుపైన అపుడు

వ. ఇదిచూచి—

విచ్చుకత్తితో విశాలాక్షు డోక – చిచ్చర పిడుగువలె
వచ్చిదూకి తనబలముకొలది కరి – పాదము తెగనరికె

వ. ఆ దెబ్బతో ఏనుగు మహాకోపమున విశాలాక్షునిపై కురికింది. ఇంతలో గన్నయలేచి అక్కడే తనకొరకు వేచియున్న గుర్రంపై కి చెంగునదూకి—

విల్లెక్కబెట్టి ఆమూవటీని తల – దుల్లవైచె భువికి
తల్లడిల్లి కుంజరమిదిగని తన – దారినిపరుగెత్తె

వ. ఈ విధంగా మూడురోజులు ఘోరయుద్ధం జరిగింది. గన్నారెడ్డి తాకిడికి తట్టుకో లేక, రాజేంద్రచోళుడు నష్టపరిహారంగా గన్నయ్యకు వేయి ఏనుగులు, పదివేల గుర్రాలు, ఏబది లక్షల బంగారు నాణెములిచ్చి వచ్చినదారిపట్టాడు.

ఈ యుద్ధంలో డెబ్బైయెనభై వేల చోళసైన్యాలు హతమై పోయాయి. గన్నారెడ్డి వీరులలో ఇరువదివేలమంది చని పోయారు.

యావదాంధ్రదేశాన్ని ఒక జెండాక్రిందికి తెచ్చిన రుద్రమదేవిని వ్యతిరేకించి, దేశానికి ద్రోహంతలపెట్టిన సామంతరాజు లెవ్వరినీ గన్నారెడ్డి బ్రతుకనివ్వలేదు. కళ్యాణపుర చోళోదయుడు, కందనోలు (కర్నూలు) పందిభూపాలుడు మొద లైన ద్రోహుల నెందరనో నాశనంచేశాడు. ఏరువనాడు, తొండ మండలం స్వాధీనం చేసుకున్నాడు. కొప్పెరజింగని ధనాగారాన్ని కొల్లగొట్టాడు.

తరువాత తన సైనికులకు తగిన బహుమానాలు యిచ్చాడు. వర్షాకాలం రాకముందే తన కోటకు చేరుకొని, మహారాణి రుద్రమదేవికి కోటిపణాలు, రెండువేల ఏనుగులు, పదివేల గుర్రాలు కానుకగా పంపించాడు.

ఇంకా గన్నారెడ్డిగాని, అతని సైనికులుగాని, సరిగా శ్వాస తీసుకోనైనాలేదు. దేవగిరి పాలకుడైన మహాదేవ రాజు తెలుగు దేశంపైకి దాడి బయలుదేరాడనీ, ఆరు లక్షల సేనతో గోదావరిని దాటడానికి ప్రయత్నిస్తున్నాడని గన్నా రెడ్డికి వార్తవచ్చింది. వెంటనే ఆ వీరయోధుడు తన అశ్వ దళంతో బయలుదేరి—

నిరుపమాన బలసాహస విక్రమ – నిధి గన్నారెడ్డి
శరవేగంబున వచ్చి దేవగిరి – సైన్యముపై దుమికి
ఉసుముచు నేబదివేల సైనికుల – ధరణికి పడగూల్చి
మెరపుతీగవలె తళతళతళతళ – మెరసి మాయమయ్యె

వ. పురుష వేషధారిణియైన అన్నాంబికవచ్చి ఈ వార్త మహారాణి రుద్రమదేవికి అందించింది. ఆమె అన్నాంబికను తగిన రీతిగా సత్కరించి, తక్షణమే బయలుదేరి వెళ్ళి కొలువు తీర్చి యీ వార్త సభికులకు తెలిపింది—

సభికుల కన్నులు జ్వాల లుమిసెను తందానా తందాని తందన
పభువు లుగ్రులై – పండ్లుకొరికిరి ,,
ఉడుకురక్త ముప్పొంగిన యువకులు ,,
వడివడిగా తమ – నడుములు బిగించి ,,
ద్రోహినిదే పడగూల్చివత్తుమని – దూసిరి బాకులను

వ. ఇప్పుడేపోయి ఆ మహదేవుని సేనలను మంజీరదగ్గర యెదిరించి, చీల్చిచెండాడి వస్తాం. ఆజ్ఞనిమ్మని మహారాణిని అడిగారు. అపుడామె యోధాగ్రగణ్యులారా!

దురాశతో మన సర్వసంపదల – దోచుకొనదలంచి
దురాక్రమణకై వచ్చిన వైరికి – మరణము నిశ్చయము
నిక్కము మనపై దాడిచేయు ప్రతి – యొక్క విరోధికిని
ఇక్కడ స్థలమిచ్చెదము సమాధికి – ఒక్కొక గజమంతె
పూర్తిగ రానిం డతని ముందునకు – పొగరడంచవచ్చు
వార్తయొకటి రావలసియున్నదా – వార్త యందగానె
ఏరీతిగ సాగించవలయునో – ఈ పోరాటంబు
వీరయోధులారా మనపథకము – వివరించెద వినుడు
యుద్ధరంగమున శత్రుసైనికుల – నోర్చి తరిమినైన
సిద్ధముజేయం డీలోగా మన – సేనలనని పలికె

వ. సభికులందరు దీనికి తమ అంగీకారం తెల్పారు. మహారాణి నాటికి సభ చాలించి, తన ఆలోచనా మందిరానికి వెళ్ళి, మహామంత్రి శివదేవయ్యతో సంప్రతించి, గన్నారెడ్డికి తోడ్పడవలసిందని చౌండసేనానికి ఆజ్ఞలు పంపింది. వయోవృద్ధుడైన చౌండ సేనాని గణపతిదేవునకు కుడిభుజంగా ఉంటూ ఉండేవాడు.

ఇకనక్కడ మహాదేవరాజు శిబిరంలో సర్వ సైన్యాధ్యక్షులు, మహామంత్రులు కొలువుదీరారు. రాజు వారితో అంటాడూ !—

గడి కదలగనీయడు వీడెక్కడి – గజదొంగయొకాని
అడుగడుగున కేదో ప్రమాదం – బావహిల్ల జేయు
కూడబెట్టితిని యిరువదికోట్లీ – గొప్ప కార్యమునకు
ఏడెనిమిది వత్సరముల కృషిఫల – మిం నా బలమంత
దుమ్ముచేయుచున్నాడౌరా ఒక – ధూర్తుం డెదిరించి
ఇమ్మహి వీని జయించి వధించు ట – దెట్లొ తెల్పుడనిన
ప్రభూ వినండని మంత్రి భవానీ – భట్టు పలికె నిటుల
సభికులార యిది దోపిడిదొంగల – జట్టు కాదు కాదు
కొందరినే గజదొంగ లెప్పుడూ – కొల్లగొట్ట రవని
సందేహము లేదిది ఆ రుద్రమ – సైన్య మనుటలోన
దొంగసైన్యమిది నాయకు డీగజ – దొంగ గన్నప్రభువు
లొంగిరాడు సామాన్యముగా రణ – రంగప్రవీణుండు

వ. అప్పు డారాజు భవానీభట్టుదిక్కుముఖుండై మంత్రి శేఖరా మీయోచన వాస్తవమే కావచ్చును. కాని మన

ముందు యీ గన్నారెడ్డి యెంత! వీడి బ్రతుకెంత! తక్షణమే దండు కదలించండన్నాడు.

వృద్ధుడూ, వీరయోధుడైన చౌండసేనాని మహారాణి రుద్రమ ఆజ్ఞల ననుసరించి గన్నారెడ్డికి తోడ్పడుతున్నాడు. గన్నారెడ్డి ఆ వృద్ధసింహంతో అంటాడు. ప్రభూ!

ఎన్ని మారణాయుధములున్న ఇం – కెన్ని సేనలున్న
ఎన్నికోట్ల ధనమున్నను స్నేహితు – లెందరు తోడ్పడిన
ప్రజలసహాయము లేనిది విజయ – ప్రాప్తి దుర్లభంబు
ప్రజాబలానికి మించినబల మీ – ప్రపంచమున లేదు
అనుభవజ్ఞులగు మన ప్రచారకుల – నందర నీనాడు
అనఘా మన పల్లెలకు పంపు ట – త్యవసరమని పలికె

వ. వెంటనే గన్నారెడ్డి తమ ప్రచారకదళాలను గ్రామ సీమలకు పంపాడు. వా రాగ్రామాలకుపోయి యెలా ప్రచారం చేస్తున్నారు —



కీర్తన

వినండి మా తలిదండ్రుల్లారా
వేగమె లేవండాంధ్రుల్లారా!
చూపండీ మన ఆంధ్రపౌరుషం
కాపాడండీ దేశగౌరవం ॥ వి ॥
కనుగానక కడుగర్వితమతియై
ధనదాహంతో ఈనాడు
మహాదేవుడను మదోన్మత్తుడు
మనదేశంపై బడినాడు

పడి నీచుడు మన పైరుపంటలను
పాడుబీడు చేస్తున్నాడు
చిట్టెడు గింజలు ఆ బలగాలకు
చిక్కరాదు దాయండీ
ఎక్కడైన ద్రోహులు కన్పించిన
తొక్కి సాగదీయండీ ॥ వి ॥

బాధాకర మొకక్షణపరతంత్రం
పదినూరేడుల నరకంకన్నా
పరమసౌఖ్య మొకక్షణస్వాతంత్ర్యం
పదినూరేడుల స్వర్గంకన్నా
కాన రయంబున యువకులు యువతులు
కదలి ముందునకు దూకండి
దూకి మహాదేవుని సైన్యంబుల
తాకి పారదోలండీ

విప్లవశంఖం పూరించండీ
విజయగీతమును పాడండీ ॥ వి ॥

వ. గన్నారెడ్డి తన సైన్యాన్నంతా చిన్నచిన్న దళాలుగా విభజించి యుద్ధానికి సిద్ధంగాఉన్నాడు.

ఇంతలో దేవగిరి సైన్యం కదిలింది. ఎలా!

విరిగిపడే పెను - కెరటంబులతో తందానా తందాని తందన
పొంగులెగసి - పెడబొబ్బలుపెట్టే ,,
జలనిధివలె నా - సైన్యంబంతయు ,,
ఉరుకులుబెట్టెచు - ఓరుగల్లునకు ,,

భీభత్సముగా అరచుచు త్రుళ్లుచు – బెళబెళ కదలింది ॥తందాన॥
గన్నయ సైరుల – కదలికచూచి తందానా తందాని తందన
ప్రళయకాల – మార్తాండుని రీతిగ ,,
భగభగభగభగ – భగభగమండుచు ,,
తక్షణ మశ్వీక – దళసహితుండై ,,
వెనుకనైపుగావచ్చి శాత్రవుల – వెన్నువిరుగతాకె ॥తందాన॥
సింహనాదమును – చేయుచు ధీరుడు తందానా తందాని తందన
దక్షయజ్ఞమును – ధ్వంసముచేసిన ,,
వీరభద్రుడై – విజృంభించి ఆ ,,
దండునంత వి – ధ్వంసము చేయుచు ,,
వీరవిహారము చేయసాగె నరి – వీరులు నుఱియింప ॥తందాన॥
హఠాత్తుగా ఈ – అమకుదెబ్బతిని తందానా తందాని తందన
బెదరి గుండెచెడి – చెదరిన సేనల ,,
సైరి కూర్చుకొని – పోరాటములో ,,
ప్రాగ్గొనులోపల – బహువిచిత్రముగ ,,
అంతర్ధానంబయ్యె దళముతో – వింతగ గన్నయ్య ॥ తందాన ॥

వ. వెంటనే మహాదేవరాజు గన్నారెడ్డి, వెనుకనుంచి దెబ్బతియ్యకుండా, తగిన కట్టుదిట్టంచేసుకొని ముందుకు ప్రయాణం సాగించాడు.

మహాదేవరాజు సైన్యాలకు వెనుకతట్టునవున్న గన్నారెడ్డి ముందుకు ఎప్పుడువచ్చాడో ఏమొ ఏంచేస్తున్నాడు—

కొండలమధ్యగ నడచు దేవగిరి – దండు నెత్తిమీద
బండలవర్షంబును గురిపించె ప్ర – చండుడు గన్నయ్య

బండలుపడి పుర్రెలు బ్రద్దలుగా – పగిలెను కొందరికి
కొండలలో చెల్లాచెదరైనది – దండు గుండెలవిసి
రాళ్ళదెబ్బలకు నలిబిలియై తమ – కాళ్ళు కండ్లు పోయి
గొల్లున నేడ్చుచు కొందరచ్చటే – కూలబడిరి తుదకు

వ. ఈ విధంగా—

అరిభీకరు డాగన్నయ ॥ సై ॥
ఉరుముచు వైరులపై బడి ,,
పలురీతుల హింసించెను ,,
పశువుల మందను కొట్టెను ,,
వెనుకనుండి అందించెడి
తినుబండారము దోచాడు ॥ భళా భళా ॥
వృద్ధసింహ మాచెౌండయ ॥ సై ॥
భీమబలాఢ్యుడు విఠలుడు ,,
శూరశిఖామణి సూరన ,,
ధీరు డజేయుడు గన్నయ ,,
నలుగురు నాలుగుదిక్కుల
తలపడి పోరుచునున్నారు ॥ భళా భళా ॥

వ. తమ స్వాతంత్ర్యాన్నీ, సంపదలనూ హరించాలని వస్తూన్న శత్రువును ప్రజ తెలాగారవిస్తున్నారు—

సామగ్రిని పశువులను గడ్డితో – సర్వము తీసుకొని
గ్రామాలకు గ్రామాలు చిటికలో – ఖాళీచేసి చని
గుట్టుగ తమధాన్యములు పాతరలు – పెట్టి పొలాలందు
మిట్టిపడుచు చనుదెంచు వైరి నరి – కట్టి రడెట్లనిన

భళాభళా నోయి తమ్ముడా - సై - భాయి భళానోయి దాదాన

బిరబిర పలుగులుతీసిరి ॥ సై ॥
చరచర గోతులు త్రవ్విరి ,,
బురదమట్టితో పూడ్చిరి ,,
గరిక చెక్కలను నాటిరి ,,
శత్రువు గుర్రాల్ వచ్చాయి
జబ్బలంట దిగబడ్డాయి ॥ భళా భళా ॥
చెంచులు కోయలు చూడర ॥ సై ॥
సెబాసైనపని జేసిరి ,,
చెట్లకు కొండా తేనెలు ,,
చిటికెలోనె పట్టించిరి ,,
దండు నటకు రానిచ్చారు
కొండ తెరలనే లేపారు ॥ భళాభళా ॥
గుంటలనిండుగ జలముర ॥ సై ॥.
గుక్కెడు త్రాగుట భయముర ,,
వనమంతా ఫలజాతులె ,,
పండ్లుమాత్రమే లేవుర ,,
పచ్చికగూడ మృత్యువై
పగవాడిని బలిగొంటూంది ॥ భళా భళా ॥
ఆశాపాశనిబద్ధుడు ॥ సై ॥
ఆ రాజేంద్రుడు కావున ,,
అష్టకష్టముల కోర్చుచు ,,
నష్టాన్నంత భరించుచు ,,

ఆగక వెనుకకు చూడక
అల్లే పయనిస్తున్నాడు ॥ భళా భళా ॥

వ. ఈ రీతిగ గన్నారెడ్డికి తన సైనికులను బలియిస్తూ, ఆ శవాలపైగా నడుస్తూ, చివరకు మహాదేవరాజు ఓరుగల్లు ముట్టడించాడు. ఓరుగల్లుచుట్టూ ఒక ఇల్లుగానీ, గ్రామంగాని లేదు. మురికి గోతులు, ముండ్లపొదలు వున్నాయి. ఇదిచూచి మహాదేవరాజు చకితుడయ్యాడు.

ఓరుగల్లుకోటయొక్క చుట్టుకొలత మూడున్నరమైళ్ళు; దానిచుట్టూ ఒకమైలూ, అక్కడక్కడా రెండుమైళ్ళ మందాన మహాదేవరాజుసైన్యం దండువిడిసింది.

మహాదేవరాజు తనతోపాటు దేవగిరినుంచి బండ్లమీద తెచ్చిన దూలాలు, వెదురుతడికలు, చర్మాలు క్రిందికి దింపించి, చకచకా డేరాలు వేయించాడు. ఇంకేముంది; సైనికి శిబిరాలు, వంటగృహాలు, వైద్యాలయాలు, అశ్వశాలలతో అదొక మహానగరంగా తయారైంది.

ఇది చూచి తెలుగురైతులు, చాకలివారు, మంగలివారు, యాదవులు, అరణ్యవాసులైన బోయలు, కోయలు, చెంచులు ఒకరేమిటి యావదాంధ్రప్రజలు ఉగ్రులై కత్తులు దూశారు.

శత్రువు యిక్కడికి చేరులోపలనే రుద్రమదేవి ఓరుగల్లు కోటను అభేద్యంగా తయారుచేయించింది. దానిముందు నూతనంగా ఒక కంపకోటను కట్టించింది. కంపా, కట్టెలూ పేర్చి గంధకం మొదలైన వస్తువులువేసి, పైన మట్టిపూసినదానిని

కంపకోట అంటారు. ఆ కోటను రక్షించటానికి ప్రసాదిత్య నాయని నియమించింది.

తన మంత్రియైన శివదేవయ్యను మహాదేవరాజువద్దకు రాయబారం పంపింది. ఆయన వెళ్ళి మహాదేవరాజుతో అంటాడూ—

మహాదేవరాజా! వినండి మా – మాటలు శ్రద్ధగను
మహీపతికి ధనదాహంబును సా – మ్రాజ్యకాంక్ష తగదు!
క్షేమము లేదెవ్వరికీని యుద్ధము – క్షామహేతువయ్య!
క్షామమువచ్చిన నీతి నియమములు – సన్నగిల్లునయ్య!
నీతినియమములు సడలిన తప్పదు – జాతికి నాశనము!
జాతినాశనానికి కారకుడౌ – క్ష్మాపతి దైత్యుండు
శుభకరమయ్య యుద్ధము మానిన – ఉభయప్రాంతములకు
ఉభయుల క్షేమము కోరి తెల్పితిని – యోచించండిప్రభు

వ. అని హితబోధ చేయుచున్న శివదేవయ్యనుచూచి పకపకా నవ్వి అతడంటాడూ—

విన్నామండీ మీ యుపదేశము – విరమించండింక
పన్నినాము బహుచక్రని వ్యూహము – నన్ను మోసగింప
వీరభోజ్యమగు సామ్రాజము నొక – నారియేలుతుంద
పౌరుషముంటే చూపండీ మీ – ప్రతిభ యుద్ధమందు
లేకుంటే దాసోహమనినచో – నా కాళ్ళకు మ్రొక్కి
రాకుమారి రుద్రమ్మకు నేనే – రక్షణ ఇచ్చెదను

వ. ఈ మాటలువిని మహామంత్రి శివదేవయ్య తల పంకించి లేచాడు. కోటకువచ్చి విషయమంతా రుద్రమదేవికి

చెప్పాడు. ఆమె కన్నులు నిప్పులు కురిసినై. వెంటనే కంపకోటను కాపాడుతున్న ప్రసాదిత్యనాయని ముందుకు దూకమనీ, వెనుక వైపున మెరుపు దాడులుచేసి, దేవగిరి సేనలను చీకాకు పరు స్తున్న గన్నారెడ్డిని నిలిచి పోట్లాడమనీ, ఆజ్ఞలు పంపించింది. అప్పుడు—

రణము రణంబని ధణ ధణ ధణ ధణ – రణభేరి మ్రోగ
రణశబ్దమువిని ఆంధ్రసైనికుల – రక్తంబుపొంగ
కకుపూని పగవానిసైన్యమును – గదిమికూల్చనైవ
తక్షణమే ముందునకుదూకె ఒక – లక్ష సైన్యమపుడు
సింహనాదములు చేయుచు శాత్రవ – సేనలు భీతిల్ల
సింహవిక్రములు దూకిరాలమున – చిచ్చరపిడుగులన
కత్తులు, కత్తులు, కలిసెను, – పారెను నెత్తురు కాల్వలుగ
కుత్తుకలట్లట్లే పై కెగిరెను – కూలెను మొండెములు

వ. ప్రసాదిత్యనాయ డీవిధంగా వైరులపైబడి పోరాడు తున్నాడు. ఇక వెనుకవైపునుంచి—

దేవగిరీశుని సైన్యముపైబడి – దేవతలు నుతింప
ఆ వీరాగ్రణి గన్నప్రభువు పో– రాడ సాగినాడు

వ. మహాదేవరాజు సైన్యానికి ద్విముఖయుద్ధం చేయ వలసివచ్చింది. పోరు ఘోరమైంది. మహారాణి రుద్రమదేవి తరుణముచూచి, తమ యెత్తుగడ ప్రకారం—

గజబలంబు నురికించె రయంబున – కదనభూమి కపుడు
గజబలంబు రాగానె మోచన ప్ర – కార మాంధ్రసేన

వెనుకకు తగ్గెను క్రమముగ గజముల – రణభూమికి నెట్టి
కనులజూచి యిది జంకిరాంధ్రులని – గర్జించుచు రిపులు

గజముల గదుముచు రాబోయెడి దు – ర్గతిని గానకపుడు
విజృంభించి చని కంపకోటపై – విరుచుక పడ్డారు

వ. అప్పటికే కంపకోటదాటి, ఆంధ్రసైనికులు మట్టికోట లోపలికివెళ్ళారు. వారి వెనువెనుకనే ఏనుగులుకూడ కోటలో ప్రవేశించాయి. మట్టికోటను ఆక్రమించటానికి వస్తున్న దేవగిరి సైన్యాలను కోటపైనున్న విలుకాండ్రు నిలిపివేశారు. ఇంతలో!

అగ్నిహస్తులిదె అదనసియొంచి - తందానా తందాని తందన
ఆకోటకు నిప్పంటించారు ,,
భుగభుగభుగభుగ – పొగలెగజిమ్ముచు ,,
కాలసాగినది కంపకోట యిక ,,

తుమ్ములు దగ్గులు హెచ్చెను మంటలు – క్రమ్మి
కొనెను చుట్టు ॥ తందాన ॥

గుక్కతిరుగ దే – దిక్కును తోచదు ,,
ఆహాకారము – లార్త నాదములు ,,
ఆకసమంటెను – కేకలు బొబ్బలు ,,
యీగతి శాత్రవు లేబదివేలు ,,

మలమలమలమల నల్లులరీతిగ మాడిచచ్చినారు ॥ తందాన ॥

వ. మంట లారిపోరకముందే ఆంధ్రసైనికులు కోట తలుపులు తెరుచుకొని మహాదేవరాజు సైనిక వాహినులపైబడి తరిమికొడుతున్నారు.

ఇదిచూచి మహాదేవరాజు రెచ్చిపోయాడు. ఎంత నష్ట మైనాసరే అతనికి ఓరుగల్లుదుర్గం పట్టాలనే తలంపుతప్ప వేరొకటి లేదు. తీవ్రమైన పోరాటాన్ని సాగించాడు. పద మూడవనాటికి ఓరుగల్లుకోటకందకం దరిదాపులకు చేరు కొన్నాడు.

అది పదునాల్గవరోజు. నాడు మహారాణి రుద్రమదేవి స్వయంగా యుద్ధరంగానికి బయలుదేరుతున్నది. ఎలా!—

సువిశాలాంధ్రకు చక్రవర్తియౌ – శూరవనిత రుద్ర
కవచముతొడిగి భయంకరమగు తన – ఖడ్గంబందుకొని

పురుషవేషధారిణియై ఠీవిగ – తురంగంబు నెక్కి
సరగున సమస్తబలముల దోడ్కొని – సమరభూమి దూకె

వ॥ ఈ విధంగా రణభూమికి వచ్చిన రుద్రమ రౌద్ర మూర్తియై శత్రుసైన్యం మీదపడి—

కొందరగూల్చుచు కొందర చీల్చుచు – కొందర తరుముచును
చిందరవందరచేయుచు వైరుల – చెండాడుచు కలన

తురంగమును రిపుసేనల మధ్యకు – దూకించెను రాణి
దొరికె రాణియని చుట్టుముట్టి రా – తరుణంబున రిపులు

హాహాంహరాయని మహాకాళివలె – అప్పుడు రుద్రమ్మ
ఖరాసి ఝళిపించుచు నా మూకల – నురుమాడగ సాగె

పగతురతల లాకొకటిగ వ్రేటునకు – పదునైదులు తెగెను
తెగిన తలలు పైకెగురుచుండ నిక – తెగేవి తెగుచుండె

వ॥ మహారాణి రుద్రమదేవి శత్రుసైనికవలయంలో చిక్కుబడి పోరాడుతూ ఉండటం ఆమె సైనికులూ, సైన్యాధ్యక్షులూ చూచి!

చక్రబంధమున – చక్రవర్తిని
ఒక్కతె అరరె – చిక్కుకొన్నదని
ప్రభువులేని మన – బ్రతుకెందులకని
ప్రాణాలొడ్డుచు – పగతుర ఢీకొని ॥ భళిభళి ॥
గండికొట్టి గర్జించారు
రణ
చండి రుద్రమను చేరారు ॥ భళాభళా ॥
అంతలోనె రుద్రమ్మ గుజ్జ మ – త్యద్భుతముగ లేచి
బంతివోలె పై కెగసిదూకె పగ – వాని దండుమధ్య
ఘోరయుద్ధమున శాత్రవసేనల – గూల్చుచు నావేళ
వీరాంగన రుధిరస్రవంతులను – పారించినదార
ఉరుముచు ఇదిగని మహాదేవరా – జుగ్రుండై లేచి
పురికొల్పుచు తన సైన్యంబును రణ – భూమికి జనుదెంచి
కదనభూమి రుద్రమ్మను నే నీ – ఖడ్గరాజమునకు
ఇదె బలియిచ్చెదనని తనకరి నురి – కించె నామెపైకి
మహదేవుడు తనపైకివచ్చు టా – మహారాణి చూచి
మహిషాసురమర్దనివలె భగభగ – మండుచు రౌద్రమున
భీకరరూపము దాల్చి అప్పుడా – భూకాంతునిపైకి
దూకించెను శరవేగంబున తన – తురగంబు నామె
భళాభళానోయ్ తమ్ముడా –సై– భాయిభళానోయ్ ధ్దాదానా

మహాదేవరా జిదిగని ॥ సై ॥
మండిపడుచు తన గజమును ,,
తరిమెను రుద్రమ మీాదికి ,,
వెరువక రుద్రమ దానికి ,,
వడి వడి విచిత్రగతులతో
నడిపించెను తన గుఱ్ఱాన్ని ॥ భళాభళా ॥
అటు ఏనుగు ఇటు ఉరికెర ॥ సై ॥
ఇటుగుఱ్ఱం బటుదూకెర ,,
అటు ఇటు ఎటుపరుగెత్తినా ,,
అందదు గుఱ్ఱం దానికి ,,
వేడుకగా ఇరుసేనలూ
చూడసాగి రాయుద్ధంబు ॥ భళాభళా ॥
కసిబోవక తన గజమును ॥ సై ॥
గదుముచు నా మహాదేవుడు ,,
వేగమె తనబల్లెంబును ,,
విసరెను రుద్రమ మీాదికి ,,
తెట్టి బల్లెమును డాలుతో
తన్నె రుద్ర తనగుఱ్ఱాన్ని ॥ భళాభళా ॥
ఆశ్వం బాకరిమీాదికి ॥ సై ॥
అల్లే చెంగునదూకెర ,,
కరి తనతొండము విసరగా ,,
నరికెను రుద్రమ దానిని ,,
మావటీని తల చూడరా
మరుక్షణమె పైకెగిరింది ॥ భళా భళా ॥

గీపెట్టుచు నాకరి తన తొండం - బూపుకొనుచు తుదకు
చూపె పిక్కబల మాయెరుసేనలు - చూచుచుండగానె

వ. అప్పుడు రుద్రమ—

మగువను సన్నెదిరించలేని ఓ - మగవాడా రేడ
ఎగబడి ఉరికిన నిను పోనిచ్చునె - ఈరుద్రమ నేడు
అనుచు మహాదేవుని తరిమెడి-రుద్రాంబ నడ్డగించి
అని మొనసిల్చె మహాదేవుని సై - న్యంబు లన్నిగలిసి

వ. ఇది చూచి మహారాణి రుద్రమదేవి మండిపడుతూ తన గుర్రానికి హుషారిచ్చి, మడమతో గట్టిగా తన్నింది. ఎలా ఉంది గుర్రం—

భళాభళానోయ్ తమ్ముడా -సై- భాయి భళానోయ్ దాదాన
మెరపుతీగవలె మెరయుచు దుముకుచు
దొరికినవానిని కొరుకుచు ఉరుకుచు
కిలకిల కిలకిల కిలారించుచు
నలిబిలిగా సేవల బడద్రొక్కుచు - ॥ భళాభళి ॥
రామబాణ మట్లాగుర్రం
రణభూమిని విహరించింది ॥ భళాభళా ॥

వ. ఇక, రుద్రమదేవి!

తాకినవైరుల ఢీకొనియాచ్చుచు
బాకునకుమ్ముచు బల్లెము విసరుచు
రెక్కలు నరుకుచు డొక్కలు చీల్చుచు
ఎక్కడజూచిన అక్కడ తానై

భీకరయుద్ధం చేసింది
అరి
మూకల తరుమగ సాగింది ॥ భళాభళా ॥

వ. సైనికులు అడ్డంరావడంవల్ల మహాదేవుడు ఎట్లాగో బ్రతికి బయటబడ్డాడు. కాని—

దేవగిరీశుని సేనలు రుద్రమదేవిని - గని బెదరి
ఏ విధి బ్రతుకుటయని నలుదిక్కుల -- కెగబడసాగినవి
కొందరు పసుగిడజాలక శవముల - క్రింద దూరినారు
కుందుచు తమ ఖడ్గములు దించి మరి - కొంద రురికినారు
పూరిగరిచినా రెందరో, కొందరు - పుట్టలుబట్టారు
భోరున కొందరు యేడ్వసాగి రిక - ఊరుచేరమనుచు

వ. సరిగా అదే సమయానికి—

కోట తూర్పు సింహద్వారమునకు - సూటిగనారార
మేటిధీరు డోరాహోరీ పో - రాటము సాగించి
పార్థుడు పద్మవ్యూహము చీల్చిన - పగిది గన్నప్రభువు
స్పర్థబూని మహాదేవుని సేనల - బ్రద్దలు చేసికొని
రయమున సింహద్వారమువద్దకు - రానె వచ్చినాడు
జయజయధ్వనులు చేసిరపు డాంధ్ర - సైనికు లిదిజూచి

వ. అదే సమయానికి విఠల ధరణీశుడు, సూరనరెడ్డి ఉత్తర దిశనుంచి, మాల్యాల గుండయ్య, కాటచమూపతులు దక్షిణదిశనుంచి బయలుదేరి శత్రుసైనికులను చీల్చి చెండాడి, గండికొట్టుకొని ఆయా సింహద్వారాలవద్దకు చేరు కొన్నారు.

దేవగిరి సైన్యాలు బెదరి, చెదరి పారిపోవడం ప్రారంభించాయి. ఇది చూచి మహాదేవరాజు, తన మనోధైర్యాన్ని కోల్పోయాడు. మిగిలిన సేనలతో ఆంధ్రదేశ సరిహద్దులుదాటి బ్రతికి బయటపడాలనుకున్నాడు. పడుతూ, లేస్తూ ప్రయాణం సాగించాడు. రుద్రమదేవి వారిని తరుముతూనే వుంది. దేవగిరి సైన్యాల అవస్థ యవస్థగాదు—

భళాభళానోయి తమ్ముడా – సై – భాయి భళానోయి దాదాన
పండ్లూడిన వాడొక్కడు ॥ సై ॥
కండ్లుపోయి యింకొక్కడు ,,
ఒళ్ళుపగిలి వేరొక్కడు ,,
వురుకలేక ప్రతిఒక్కడు ,,
కుయ్యో మొఱ్ఱో అంటాడు
గోలగ యేడుస్తున్నాడు ॥ భళా భళా ॥
ఏమిసేతుమో దైవమ ॥ సై ॥
ఇల్లుజేర్చి కాపాడర ,,
తల్లులపిల్లల గూర్చర ,,
తప్పుగాచి మన్నించిర ,,
బుద్ధి గడ్డితినివచ్చాము
యుద్ధానికి మేమంటాము ॥ భళా భళా ॥

వ. ఈ స్థితిలోవుండగా అక్కడెక్కడో పిట్ట బ్రుర్రు మంది—

అదిగో రుద్రమ – ఇదిగో రుద్రమ – తందానా తందాని తందన
వచ్చెను వచ్చెను వచ్చిపడినదని ,,

హడలి కొండ రట్లల్లేజచ్చిరి ,,
అరుపులుడిగి వికలాంగులుకూడ ,,
తల్లడిలుచు ఎచ్చటికో మెల్లగ డొల్లుచునున్నారు
‖ తందాన ‖

వ॥ కడకు మహాదేవరాజు అతి కష్టంమీద గోదావరి నదిని దాటాడు. రుద్రమదేవి ఆజ్ఞానుసారం గన్నారెడ్డి ఇరువది వేల ఆశ్వికదళముతో వచ్చి, ఎల్లోరా కొండలలో దారికాచాడు. అటు గన్నారెడ్డి. ఇటు రుద్రమదేవి. మధ్యలో మహాదేవరాజు చిక్కుపడ్డాడు. చేయునదిలేక తన మంత్రియైన భవానీభట్టును రుద్రమవద్దకు రాయబారం పంపించాడు.

ఆమె కోట్లద్రవ్యం నష్టపరిహారం అడిగింది. మహాదేవ రాజు దీనికంగీకరించి, ఆమె ఎదుటకేగి, కిరీట మామెపాదాలవద్ద వుంచి క్షంతవ్యుడనన్నాడు. రుద్రమదేవి అతనికి వుచితాసనం ఇచ్చి, మహాదేవరాజా !

తోడ్పడినంతనె నల్గురు దే - శద్రోహులుమావారు
చేడ్పాటెరుగక వచ్చితే? యుద్ధము - సేయగ మాపైకి
పోరునష్టమని తెల్పిన మాహిత - బోధ వినక నీవు
పేరాశనుబడి దిగితివి తుద కీ - ఘోరయుద్ధమునకు
పరపరిపాలనక్రిందనున్న మా - ప్రదేశ మంతటిని
హరిహరాదు లెదిరించిన వదలక - ఆక్రమించగలము
అంతేగాని తదన్య ప్రదేశ మ - దెంత దొడ్డదైన
నుంతకూడ వలదయ్యామాకు, అది - సువర్ణమగుగాక

మీ ప్రాంతంబును బాగుజేసుకొని - మీరు సుఖించండి
మా ప్రాంతంలో కాలుపెట్టితిర - మననీయము మిమ్ము
ఇది మాసిద్ధాంతంబని అతనికి - ఎరుకపరచి, తుదకు
వదలివైచి, తగు బుద్ధిగరపి ఆ - వసుధాధిపు నామె
త్వరగ నోరుగల్లునకు జేరుకొని - జరిపె నొక సదస్సు
అరుదెంచిరి నిఖిలాంధ్రప్రముఖు లా - యాంధ్ర మహాసభకు
చుట్టిపెట్టి సామంతుల దేశ - ద్రోహులైనవారి
పట్టి రాజసభకీడ్చి తెచ్చి నిల - బెట్టి రాంధ్రభటులు

వ. సభా ప్రారంభానికి ముందు మృతవీరుల గౌరవార్థం సభికులంతా లేచి నిలచి వారిని స్మరిస్తున్నారు. ఎలా !

పాట

వందనాలురా - వందనాలుర
వందనాలు విప్లవాభి - వందనాలుర ॥వంద॥

పల్లెలలో - పట్నాల్లో
ప్రతి ఒకరంగంలోనూ
మసలుచు ఢీకొని వైరుల
మదమడంచిన ధీరులార ॥ వంద ॥

కొండలలో - గుట్టలలో
ఘోరారణ్యంబులలో
తిరుగుచు దేశద్రోహుల
నుసుమాడిన యోధులార ॥వంద॥

అమరజీవులార ఇవె
అందుకొండిర

ఆంధ్రప్రజలు మూడుకోట్లు
అందజేయు జోహార్లివె
అమరజీవులార ఇవె
అందుకొండిర
అందుకొండిర ॥

వ. ప్రార్థనానంతరం సభికులంతా తమతమ ఆసనాల నలంకరించారు. అప్పుడు—

ఆంధ్ర మహాసామ్రాజ్యలక్ష్మి రు - ద్రమ్మ లేచి నిలచి
ఆంధ్రపౌరుషము తేజముట్టిపడ - ఆ సభికుల జూచి
ఎంతో గంభీరముగ వినయముగ - ఇట్లుపన్యసించె
మంత్రులార పండితులారా సా - మంతరాజులార
ఆంధ్రసైనికుల్లారా ఓ సై - న్యాధిపతుల్లార
ఆంధ్రయువక యువతీమణులారా - త్యాగధనుల్లార
మేధావుల్లారా కవులార - మేటి ధీరులార
సాధుమూర్తులగు కార్మిక కర్షక - యోధులార వినుడు
దేశద్రోహుల చెండాడుచు, మీా - ధీరత్వము చూపి
దేశంబును కాపాడినారు సం - దేహము లేదిందు
దురమున వైరిబలంబుల ఢీకొని - తరిమి తరిమి కూల్చి
అరిజనభీకరు లాంధ్రుల నెడి, ప్ర - ఖ్యాతి నిలిపినారు
అందరి కాంధ్రప్రభుత్వము తరఫున - వందనంబు లివిగో
అందజేయుచున్నది యీరుద్రమ- అందుకొనండనిన
నభమదరగ కరతాళధ్వనులు ని - నాదంబులుచేసి
సభాసదులు ప్రకటించినారు తమ - సంతోషంబపుడు

వ. తరువాత తమ స్వార్థంకోసం దేశాన్ని పరాయి రాజులకు అమ్మజూపిన ద్రోహుల విచారణ ప్రారంభమైంది. తమ తప్పులన్నిటిని ఆ ద్రోహులు అంగీకరించారు. తుదకు క్షమించమని మహారాణిని వేడుకున్నారు. మహారాణి వారికి బుద్ధిగరపి ప్రాణాలతో విడిచిపెట్టింది.

గోన లకుమయారెడ్డి సన్యసించి, తపస్సు చేసుకుంటానని శ్రీశైలపర్వతాలకు వెళ్లాడు. సభా కార్యకలాపాల అనంతరం రుద్రమదేవి వీరయోధుండగు గన్నారెడ్డిని సభికులకు చూపి—

అన్నము నీళ్ళనకుండ తిరిగి ఎ - న్నెన్నో పాట్లుపడుచు
గన్నప్రభువు విజయము సాధించిన - ఘనుడు త్యాగమూర్తి
నిజదేశంబును కాపాడుటకై - గజదొంగగ మారి
ప్రజాహంతకుల దేశద్రోహుల - పట్టి కూల్చినాడు
ఇన్నిపనులు నా ఆజ్ఞమీదనే - ఈ వీరుడు చేసె
అన్నాంబిక ఒక ద్రోహిసుతుని పెం - డ్లాడననుచు పోయి
గన్నప్రభువునకు అంగరక్షకుడు - గా పనిజేయుచును
వన్నె తెచ్చినది ఆంధ్రస్త్రీలకీ - వనితామణి నేడు

వ. ఈ రీతిగా మహారాణి ఆ వీరయువతీయువకులను సభాసదులకు పరిచయం చేసింది.

పిమ్మట మహారాణి, అన్నాంబిక తండ్రిని పిలచి కోటా రెడ్డి ప్రభూ! మీ కుమార్తె గజదొంగ గన్నారెడ్డి ప్రభువును వివాహం చేసుకోదలచింది. అంగీకరిస్తారాఅని అడిగింది నవ్వుతూ. "అంత అదృష్టమా తల్లీ" అన్నాడు కోటారెడ్డి సవినయంగా.

తరువాత మహారాణి రుద్రమదేవి సమక్షంలో మహా వైభవంగా గన్నారెడ్డికి, అన్నాంబికకు వివాహం జరిగింది.

మహారాణి దంపతుల నాశీర్వదించింది. పెండ్లి పెద్దలు కూడ తమతమ దీవెనలు వారి కందించి—

జయము దిగ్విజయ మాంధ్రమాతకూ జైజై యన్నారు
జయము జయము మన రుద్రమదేవికి జై అని లేచారు

సమాప్తం.








**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B199 |
| పుస్తకం పేరు | రుద్రమదేవి |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 63 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sowmya |
| పేజీలు విడదీసినది | sowmya |
| స్కాన్ చేసినది | Heena |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |